

ఆధునిక జీవనం సిక్స్ పేక్ హృదయం, యూజర్ నేమ్, పాస్ వర్డ్, క్లోన్డ్ సంతతి, వినైల్ ప్రింట్లు, డిజిటల్ దినాలు వంటి అత్యాధునిక పరిభాషను అందించినా ఈ కవి మూలాలు పల్లె పట్టుల్లోనే ఉన్నాయని కొన్ని కవితల్లోని పదసంపద తెలియజెప్తుంది. విత్తనాలకై ఎండబెట్టిన బీరకాయ, అల్చిప్ప కన్ను, గాలిబొమ్మ, కర్రాట, మట్టిపైని అణుగుకోడి, పరికంకుల కుంచె, ఎద్దుకు కొట్టే నాదాలు, ఇవన్నీ నేటి నవనాగరికుని అనుభవం లోకి రాని వస్తుసామాగ్రి – **శిఖామణి, కవి విమర్శకుడు, ప్రొఫసర్ తెలుగు యూనివర్శిటీ, హైదరాబాద్.**

యానాం అంటే వొక మెరుపు మలుపుల గోదారి వెంట ప్రయాణం. సరిహద్దుల మధ్య కలిసే భాషల, సంస్కృతుల హోరు. తెలుగు కవి సాధారణంగా తెలుగు హోరుని దాటి వెళ్ళడు. ఇస్మాయిల్ గారి కప్ప లాగ. కాని, కవిత్వం ఉన్నచోటల్లా ప్రవాసం వెళ్లి, అక్కడి నించి పాడే పిట్ట బాబా. అందుకే అతని కవిత్వం తన ఎల్లలు తానే చెరిపేసుకొని నేలా-ఆకాశం ఉన్నా చోటల్లా కొత్త కవిత్వ ప్రపంచ పటాన్ని గీస్తుంది, కరుణతో, ప్రేమతో, మనిషితనంతో. అందుకే, గ్లోబలి పీట మీద కూడా బాబా ఐ.డి. మానవత్వమే, పాస్ వర్డ్ కవిత్వమే! – **అఫ్సర్, అధ్యాపకులు, ఆసియా విభాగం, యూనివర్శిటీ ఆఫ్ టెక్సాస్ - ఆస్టిన్.**

ఎవరో మహానుభావుడు కాసిన్ని అక్షరాల్ని కాలానికి అర్ఘ్యమిస్తాడు. ఊహాల ఛాయలతో పిడికెడు ఆలోచనల్ని పుటలపై చల్లుతాడు. ఎవరో (ఆయన కూడా మహానుభావుడే) ఆ పుస్తకాన్ని తన హృదయ కవాటాల్ని తెరుచుకొని ఆవలోకిస్తాడు. అంతే ఒక సంగీతమేఘం తేనె పాటల్ని వర్షిస్తుంది. అక్కడితో అయిపోలేదు. ఆ రాగ స్పర్శకు మనోయవనికపై ఓ అపరిచిత అరణ్యం మొలకెత్తుతుంది. బొల్లోజు బాబా ఒక రసావిష్కరణ జరిగిపోవడంతో సరిపెట్టుకోడు. పుస్తకంలోకి నడవటాన్ని పరిచిత పాత్రలోకి మనల్ని మనం ఒంపుకునేట్టుగా మలుస్తాడు. – **దాట్ల దేవదానం రాజు, కవి, రచయిత, యానాం**

అసంఖ్యాక ఇంటర్నెట్ పాఠకులను కూడా తన కవిత్వంతో, చక్కని విశ్లేషణలతో ఆకట్టుకొనే నిజమైన సాహిత్య ప్రేమికుడు బొల్లోజు బాబా. ప్రతీకలు, పదచిత్రాలు ప్రయోగిస్తూనే కవిత్వంతో హృదయానికి తీయని బాధను పంచిపెట్టగల రసపిపాసి.
**– డా. దార్ల వెంకటేశ్వర రావు, ప్రొఫసర్, హైదరాబాద్ విశ్వవిద్యాలయం**

పద్మనాభనాభ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ – కాకినాడ , ఫోన్ : 6588013

ఆకుపచ్చని తడిగీతం

# ఆకుపచ్చని తడిగీతం



## బొల్లోజు బాబా

# ఆకుపచ్చని తడిగీతం

బొల్లోజు బాబా

అక్టోబరు 2009

కవర్ డిజైన్: చిన్నారి, యానాం

బొల్లోజు బాబా, లెక్చరర్
30-7-31, గొల్లల వీధి
సూర్యనారాయణ పురం
కాకినాడ, 533001
తూర్పుగోదావరి జిల్లా.

ఫోన్: 9849320443
0884/2368189

Please Visit - **http://sahitheeyanam.blogspot.com/**

|

**విషయసూచిక**

మగువా!
నా ప్రపంచాన్ని నీ సొగసరి
అంగుళులతో స్పృశించావు, అంతే
ప్రశాంతత సంగీతమై పల్లవించింది.
టాగోర్ – స్ట్రే బర్డ్స్

సూర్యపద్మ కు



కవిత్వంలోకి చేయిపట్టుకొని నడిపించిన శిఖామణి గారికి

యానాం ఎప్పుడెళ్లినా పుస్తకం ఎప్పుడు తెస్తావూ అంటూ
పలకరించే శ్రీ దాట్ల దేవదానం రాజు గారికి

ఆత్మీయంగా అక్షరాశీర్వాద వాక్యాలు వ్రాసిన అఫ్సర్ గారికి, దార్ల వెంకటేశ్వర రావు గారికి, సౌభాగ్య గారికి,

అందమైన ముఖ చిత్రాన్ని ఇచ్చిన బాల్య మిత్రుడు చిన్నారి కి

చెల్లి రాం, ఫణి, ప్రభాకర రావు, సారధి, సంజీవకుమార్ లకు,

అంతర్జాలంలో నా '**సాహితీ యానం**' బ్లాగు కు వచ్చి నా కవితల్ని చదివి ప్రోత్సహిస్తూ, తప్పొప్పులు చెపుతూ, సలహాలిస్తూ, ముందుకు నడిపించిన బ్లాగ్మిత్రులకు పేరు పేరునా

కృతజ్ఞతలు తెలియచేసుకొంటున్నాను.

బొల్లోజు బాబా

## కాలుష్యం అంటని కవి బొల్లోజు బాబా

–శిఖామణి

1991 ప్రాంతంలో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈవారం కవిత శీర్షికలో బొల్లోజు బాబా పేరుతో కవిత చదివి ఆశ్చర్యపోయాను. మన బొల్లోజు బసవలింగం మాస్టారి గారి అబ్బాయి బాబా నా అనే సందేహం కలిగింది. సందేహంలేదు ఆ బాబానే. మా బాబానే! అప్పటికి ఒకటి రెండు సంవత్సరాలకు ముందే ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈవారం కవిత అనే కొత్త శీర్షిక లో నా కవిత రావాలి అని ఎంతో మంది కవులు అనడం విన్నాను నేను. బాబాతో అదే అన్నాను. ఎవరి ప్రాపకం లేకుండా నీ కవిత ఈవారం కవితలో వచ్చిందంటే ఇక నీకు తిరుగులేదు, రాసుకో పో అన్నాను. నాకు యానం మట్టిలో పుట్టిన మరో కవిత్వ వారసుడు దొరికాడు అని ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాను. అయితే నా ఆనందాన్ని ఆవిరిచేస్తూ బాబా సుమారు దశాబ్దకాలం పైగా అదృశ్యం అయిపోయాడు. ఇదిగో ఇపుడు ఈ 2009 లో ఒక ఆకుపచ్చని తడిగీతం గా విస్తరించి మనముందు ప్రత్యక్షం అయ్యాడు.

ఈ బాబా వొఠి బాబా కాదు. ఇతని వెనక సాహిత్యవారసత్వం ఉంది. అది వాళ్ల నాన్నగారిచ్చిన సంపద. బొల్లోజు బసవలింగం మాస్టారు ఉత్త మాస్టారు కాదు. ఆయనకు తెలుగుతో పాటు, సంస్కృతం, ఆంగ్లం, ఫ్రెంచి భాషా సాహిత్యాలలో మంచి అభినివేశం ఉంది. 'సువర్ణశ్రీ' పేరుతో ఆయన రచనలు చేసారు. ఆయన రాసిన సాంఘిక ప్రభోదాత్మక నాటకం 'నేటి విద్యార్థి' మా కాలేజీ రోజుల్లో విద్యార్థులు విజయవంతంగా ప్రదర్శించేవారు. తమిళంలో వున్న 'ఆనందరంగరాట్ఛందం' గ్రంధంలో తెలుగు విశేషాలు గురించి కొంత పరిశ్రమ చేసారు. విద్యార్థి నాయకునిగా ఫ్రెంచి పాలననుండి యానాం విమోచనోద్యమంలో చురుకైన పాత్ర పోషించారు – అలాంటి సాహిత్య, సాంస్కృతిక వారసత్వం నుండి కవిగా ఎదిగొచ్చినవాడు బొల్లోజు బాబా.

ఈ తడిగీతంలోకి విస్తరించుకొంటూ లోపలికెళ్తుంటే ఎందుకో నాకు 70 ల నాటి ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి అనుభూతి గీతాలు, దానికి అజంతా రాసిన ముందు మాటా గుర్తుకొచ్చాయి. ఇప్పుడు ఈ పద్యాలు చదువుతుంటే బాబా కల్మషం అంటని కవిలా గోచరిస్తున్నాడు.

హేమంతోత్తరీయాన్ని కప్పుకున్న వనం
ఆకుల కొనల వేలాడే
మంచు బిందువుల భారాన్ని
మోయలేక అలసిపోతోంది.

అంటూ మొదలయ్యే వెన్నెల నావ ప్రయాణం అంతరంగపు లోతుల గుండా ప్రయాణించి మనల్ని అనుభూతి శిఖరంమీద కోచోపెడుతుంది. వాన కురవడానికి కవి ఊహించిన కారణం ప్రకృతి తన్మయీభావాన్ని ప్రకటిస్తుంది.

మేఘాలూ నేలా
రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి.
తెల్లవార్లూ వాన కురుస్తూనే ఉంది.
......
సూర్యకిరణాల కిలకిలారావానికి
లిట్మస్ పేపర్‌లా ఆకాశం రంగు మారింది.

ఈ పంక్తులు కవిలోని రసాయినిక చర్యలు మనకు పట్టి యిస్తాయి. మొత్తం పర్యవసానం కవి ఆలపించే ప్రాచీన గీతానికి కాన్వాసును సిద్ధం చేయటమే!

తడిచిన సీతాకోకచిలుక
కవిత్వంపై వాలి రెక్కలల్లార్చింది.

అనడం ద్వారా ఒక రసార్ద్ర చిత్త హృదయాన్ని కవి పాఠకుని ముందు పరిచాడు. ఈ ముగింపు వాక్యాలు చదివాక పఠితల్లో ఒక కొత్త మనోద్వారం తెరుచుకుంటుంది. అక్కడ్నుంచి అంతర్గత సంభాషణ మొదలౌతుంది.
ఒంటరి దీవిలో ఉన్న కవి ఒక సమూహం అంతశక్తిమంతుడు. సమూహంలో సంచరిస్తున్నా కవి అపరిచితుడు, ఒంటరికూడా! దీనికి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ ల సహపంక్తిలోని వాడు బాబా. లేకపోతే

అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే
మబ్బుల మధ్య గుంపునుకోల్పోయిన
కొంగపిల్ల తుమ్మ చెట్టుకు గాయమై
వేలాడడమే!

అని వ్రాయగలిగే వాడు కాదు. జ్ఞాపకం మానవ జీవితాన్ని సౌందర్య విషాదాలలో ముంచితేల్చే అమృతగుళిక. జ్ఞాపకాలు లేనివాడు ముందు మనిషెట్లా అవుతాడు? అసలు కవెట్లా అవుతాడు. బాబా జ్ఞాపకం గురించి రెండు మధురమైన కవితలు రాసాడు. ఈ కవితలు చదివితే నల్లగేటు నందివర్ధనం చెట్టులో నేను రాసుకొన్న 'ఎందుకొస్తావే జ్ఞాపకానికి మీరా' కవిత గుర్తుకొచ్చి హృదయం చెమ్మగిల్లింది.

రాత్రయితే చాలు
1. ఋతువు తప్పని /వలస పక్షుల్లా
నీ జ్ఞాపకాలు/హృదయంపై వాలతాయి.

2. ఏకాంత సాయింకాలపు పలుచని వెలుతురులో
హృదయంలో విరిసిన సన్నజాజుల గానంలా
ఓ జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.

3. అల్చిప్ప కన్నుతో/ మామిడి చెక్కు ఒలిచినట్లుగా
జ్ఞాపకాల ఒక్కోపొరనీ/ ఒలుచుకుంటూ పోతే
చివరకు ఒక స్ఫటిక సదృశ/ కన్నీటి బిందువు మిగిలింది.

ఈ పంక్తుల్లోని 'రుతువు తప్పని' మాట జ్ఞాపకం అనివార్యతనీ, 'హాయిగా సలపటం' జ్ఞాపకం యొక్క స్వభావాన్ని, చర్యనీ, స్ఫటిక సదృశం పదంతో దాని నిర్మలత్వాన్ని కవి ధ్వనిస్తున్నాడు. భారతీయ సంస్కృతిలో 'గురు' సంస్కృతికి ఎంతో ఉన్నత స్థానం ఉంది. తల్లి దండ్రుల తర్వాతి స్థానం గురువులకిచ్చి గౌరవించిన సంస్కార సంపద మనది. శిష్యుల్ని అభిమానించి ప్రేమించే తత్వంలోని మాధుర్యగుణం అనుభవపూర్వకంగా తెలుసుకోవలసిందే! అలాంటి అనుభవం నుండి రాసిన కవిత 'సార్ గారండీ! సార్ గారండీ!'

వాని ఆలోచనల చురకత్తులు
పదును పెట్టుకోవటానికై
నా మెదడును సానరాయిని చేస్తాను.

నిజమైన గురువు చేయవలసిందిదే! అలాంటి శిష్యుల నుండి 'బాగున్నారా మాస్టారు' అన్న పలకరింపు కన్నా ఇంకేం కావాలీ జీవితానికి అంటాడు.

గురువు తరువాత అంతటి ప్రభావాన్ని చూపగలది పుస్తకమే! పుస్తకం చీకటి గదిలో దీపం లాంటిది అన్నాడు డా. బి.ఆర్. అంబేద్కర్. పుస్తకాన్ని చదవడంలోని అనిర్వచనీయమైన ఆనందాన్ని 'పుస్తకంలోకి నడవటమంటే' అనే కవితలో బాబా ఒడిసిపట్టుకున్నాడు.

ఎప్పుడో, ఎక్కడో, ఎవరో ఒకడు/ ఆ పుస్తకాన్ని తెరుస్తాడు.
ఒక జీవనది వాని గుండెల్లోకి/ ప్రవహించటం మొదలౌతుంది.

జీవనది ఆర్ద్రతకు, కదలికకు, చైతన్యానికి ప్రతీక. చలం అన్నట్టు ఈ పుస్తకాలు పటం మల్లె గోడకి వేళాడేవి కాదు. మంచికో చెడ్డకో జీవితాల్ని ప్రభావితం చేసేవి. ఉత్తమ పాఠకుడు కాగలిగిన వాడే 'ఉత్తమ కవీ కాగలడు' బాబా ఉత్తమ పాఠకుడని ఇలాంటి కవితలు సాక్ష్యమిస్తాయి.

ఈ సంపుటికి మకుటాయమానమైన కవిత 'యూజర్ నేమ్: మనిషి – పాస్ వర్డ్: మానవత్వం' కవిత. ఆధునిక టెక్నాలజీలో వచ్చిన సాంకేతిక పరిభాషను మనుషులు మర్చిపోతున్న మానవత్వానికి అన్వయించి రాసిన గొప్ప కవిత ఇది – అభివ్యక్తిలోనూ కొత్తదారులు తొక్కిన కవిత. కవిత అంతాచదివాక గొప్ప అనుకంప మనసు నిండా, శరీరం నిండా ఆవరిస్తుంది. శక్తిమంతమైన లక్షల మెగావాట్ల హైపర్ టర్బయిన్‌లతో శరీరంలోని రక్తాన్నంతా బయటకు తోడిపోసిన ఒక డొల్లతనం భయపెడుతుంది. ఇంతాచేసి మనిషి ఇంతేనా అనిపిస్తుంది. ఈ వాక్యాలు చదవండి ఎంత భయపెడుతున్నాయో!
జీవితం ఫోల్డర్ లోని శాంతి అనే ఫైలు
ఎంత ప్రయత్నించినా తెరుచుకోవటం లేదు.
దేవుడా! దయచేసి నా పాస్ వర్డ్

రిట్రీవ్ చేసి పెట్టవూ?
ఈ నూతిలో గొంతుకను మనందరం వినితీరవలసిన అగత్యం ఎంతైనావుంది.

ఇంతటీ స్వచ్ఛ కవినీ ఇస్మాయిల్ గారు అన్నట్టు 'భాదించే లోకపు ముల్లు' భాదిస్తూనే వుంది. ప్రాచీన గ్రామీణ భారతం నుండి ఆధునిక గ్లోబల్ విలేజీ వరకూ ఈ దేశ మూల వాసుల్ని 'మీరేవుట్లూ' అని శూలంతో ప్రశ్నిస్తూనేవుంది. అనివార్య సామాజిక సంఘర్షణలో కవి దానికి సమాధానం చెప్పుకోవడం 'బి.సి. అంటే ఎవరు నాన్నా' కవితలో చూడవచ్చు. సంపదను ఉత్పత్తి చేసే కులవృత్తుల పతనం తరువాత ' స్మశానంలా తీసుకోవడమే కానీ ఇవ్వటం తెలీని ఈ సమాజానికి తరతరాలుగా సంపదను అందిస్తున్న ఈ జీవిని ఎలా నిర్వచించాలి? అని మధనపడతాడు. పుట్టి పెరిగిన ఇంటిని చాలా ఏళ్లతర్వాత చూసినపుడు కలిగిన బాధ, లేని నాన్న టేబుల్ మీద వదిలి వెళ్లిపోయిన చేతి గడియారాన్ని చూసినప్పుడు పడ్డ సంవేదన కవితాకృతులు దాల్చాయి.

ఆధునిక జీవనం సిక్స్ పేక్ హృదయం, యూజర్ నేమ్, పాస్ వర్డ్, క్లోన్డ్ సంతతి, వినైల్ ప్రింట్లు, డిజిటల్ దినాలు వంటి అత్యాధునిక పరిభాషను అందించినా ఈ కవి మూలాలు పల్లె పట్టుల్లోనే ఉన్నాయని కొన్ని కవితల్లోని పద సంపద తెలియజెప్తుంది. విత్తనాలకై ఎండబెట్టిన బీరకాయ, ఆల్చిప్ప కన్ను, గాలిమొమ్ము, కర్రాట, మట్టుపైని అణుగుకోడి, వరికంకుల కుంచె, పూడిక తీయని బావి, ఎద్దుకు కొట్టే నాడాలు, చూరు అంచులు ఇవన్నీ నేటి నవనాగరికుని అనుభవం లోకి రాని వస్తుసామగ్రి.

ఇస్మాయిల్ గారి కవిత్వాన్ని ఇష్టంగా, కంఠదఘ్నంగా చదూకొన్న ఈ కవి ఇస్మాయిల్ గారు పనిచేసిన పిఠాపురం మహరాజువారి కాలేజీలో ఉద్యోగించటం యాదృచ్ఛికమే అయినా ఇక్కడ కూడా ముఖ్యంగా లఘు కవితల్లో ఇస్మాయిల్ గారు తొంగిచూడడం – మొదటి సంపుటి కనుక ఆహ్వానించదగ్గదే! దశాబ్దం విరామంతర్వాత కవిగా ముందుకొస్తున్న బాబాకు నా కవిత్వాలింగన.

శిఖామణి
28 సెప్టెంబరు 2009



# ఆర్ద్ర కవిత్వపు వెన్నెల వాన

కవిత్వ రచనా మమకారం దాచేస్తే దాగేది కాదు. రాయకుండా ఉండలేనితనం కుదిపి మరీ బయటకు తీసుకొస్తుంది. ఒక మెరుపు మెరిసినట్లు తళుక్కున కవిత్వపాదమేదో స్ఫురిస్తుంది. మననం చేసుకుంటూ అనవసరమైన దాన్ని పరిహరిస్తూ దొరికిన కాగితం మీదకు ఒంపుకోవల్సిందే. ప్రాకృతిక పారవశ్యాన్ని ఆత్మ సంవేదనలో ముంచి కవిత్వీకరించే పనైతే మరీను. హృదయ భారం తొలగి తేలికవ్వడం అంటే ఆరోగ్యహేతువైన ఔషధం దొరికినట్లే కదా! జీవనగమనంలో ప్రాధాన్యతా క్రమాల్ని ఎంచుకోవడంలోని తడబాటు భావనా ప్రపంచం కుంచించుకు పోయేటట్లు చేస్తుంది. అయినా ఏ మూల నుండో ఒక ఉత్ప్రేరకం తట్టి లేపుతుంటుంది. ఒకానొక అనివార్యత పరిమళం గుప్పుమనేటట్లు చేస్తుంది. కాలమో వృత్తో అనుబంధాలో బాధ్యతలో ఒత్తిళ్ళో మానసిక సంఘర్షణలో స్పర్శాతీత కల్లోలాలో ప్రవృత్తుల్ని ఎంతమాత్రం దహించలేవని బొల్లోజు బాబా ను పరికిస్తే అర్ధమౌతుంది. లోలోపలి చెమ్మను అనుభవించి పలవరించి కొత్త మొలకై చిగురించి తాజాగా తనను తాను మొలిపించుకునే ప్రయత్నమే బొల్లోజు బాబా చేసారు. పద్దెనిమిదేళ్ళ క్రితం ఆంధ్రజ్యోతి ఈ వారం కవితగా ప్రత్యక్షమైనపుడు కవితాలోకం బాబా గురించి ఆరా తీసారు. మరల ఇపుడు దోసిల నిండా కవిత్వ గుభాలింపుల్ని మోసుకుంటూ అక్షర కాంతుల్ని వెదజల్లుతూ ఆకుపచ్చని తడిగీతాలుగా పలకరిస్తున్నాడు. విరామం మాయమవడం కాదు. అందమైన కొనసాగింపుకు నిశ్శబ్దప్రయాణం అన్నమాట ఈయన విషయంలో అది నిజమైంది. తాను పరవశిస్తూ కవిత్వాభిమానుల గుండెల్ని మీటే పనిమీద బొల్లోజు బాబా ఉన్నాడని ఈ కావ్యం నిరూపిస్తున్నది.

వీలున్న ప్రతి సందర్భంలోనూ శిఖామణి పలు సభా వేదికలపై బొల్లోజు బాబా పేరు ప్రస్తావించకుండా ఉండలేదు. స్థానిక కవులు వెలువరించిన కవితాసంపుటుల్లో సైతం బొల్లోజు బాబా గురించి రాసి కవిని బయటకు తెచ్చే ప్రయత్నం చేసారు. అయినా కదలిక లేదు. అలాంటి బాబా ఆ మధ్య చక్కగా కవితల్ని డి.టి.పి. చేసుకుని వచ్చి ఆనందాశ్చర్యాలకు గురి చేసారు. గత కొంతకాలంగా ఇంటర్‌నెట్ లో సాహిత్యానం.బ్లాగ్‌స్పాట్.కాం అనే బ్లాగు ద్వారా కవిత్వ ప్రేమికుల్ని అలరిస్తూ తన అస్తిత్వాన్ని బలంగా గాఢంగా నిండార సాంద్ర కవిత్వంగా నింపుకుంటూ ఇపుడిలా కావ్యమౌతున్నందుకు ఆనందం కలుగుతున్నది.

కవిత్వం హృదయ సంబంధి అన్న ఇస్మాయిల్ మాటలు నిజమే కదా అనిపిస్తుంది బొల్లోజు బాబా కవితలు చదువుతుంటే. వైయుక్తిక అనుభూతిని సార్వజనీనంగా చిత్రించే కవితానిర్మాణం కరువై ఒక స్తబ్దత వాతావరణం ప్రస్తుతం నెలకొంది. తక్షణ స్పందనలతో

కాసింత తాత్వికతను మేళవించడం లేదా గుప్పెడు నినాదాలై చిట్లిపోవడం లేదా ఆగ్రహావేశాల్ని హఠాత్తుగా కొని తెచ్చుకోవడమే కవిత్వంగా వదులుతున్నారనిపిస్తున్నది

ఎటువంటి సంధియుగంలోనైనా కవి నిస్తేజంగా ఉండలేడు. ప్రాపంచిక విషయాల పట్ల దూరాన్ని పాటించలేడు. సమూహంలో ఏకాకితనపు జాడల్ని భరించలేడు. అంతర్లోకంలో వీచే గాలులకు మౌన ప్రేక్షకునిగా మిగిలిపోలేడు. అనుభవాలు ప్రశ్నల ఇసుకను కళ్లల్లో చల్లి పోతూనే ఉంటాయి. భావనా సంద్రంలో ఈదులాడినపుడు ఊహల్నీ ఆలోచనల్నీ నిర్భంధించే అడ్డుగోడలేవీ? భావుకుడైన వాడు మానసికంగా చేసే ప్రయాణం కవిత్వమే అవుతుంది. ఒక సంఘటన ఒక మెరుపు ఒక ఆవేశం ఒక ఉద్వేగం ప్రేరణగా కవిత రూపు దిద్దుకుంటుంది. పదచిత్రం ద్వారా దృశ్యం సాకారమవుతుంది. అందుకే కవిత్వమే సాంత్వన చేకూరుస్తుందనే ఎరుక వల్ల బొల్లోజు బాబా కవిత్వాన్ని ఇంటిపెద్దగా సంభావించాడు. అలాగే మనిషిని చేసే శక్తి కవిత్వానికే ఉందని ఊరట చెందుతున్నాడు.

రాలిన పూలను తురుముకున్న కాలిబాట సుగంధాలను గానం చేస్తుంది. ఇక తన్మయత్వంతో తలలూపే పని బాటకిరువైపులా ఉన్న చెట్లదే. చందమామ – నిద్రలో శిశువు పెదాలపై పరుచుకునే నవ్వులా ఉంటాడు. గులకరాళ్ళతో మాట్లాడే సెలయేరు వడివడిగా ప్రవహిస్తుంది. వెన్నెల్లోని మల్లెఛాయ వెలుగులో తిరుగాడే మిణుగురులు పగలు వెలిగే వీధి దీపాల్లా వెలవెల బోతాయి. వెన్నెల నావనెక్కి రాత్రి ఒంటరిగా వేకువ తీరానికి సాగిపోతుంది. ఇలా మనం 'వెన్నెల నావనెక్కి' కవితలో శుభ్ర స్వచ్ఛ కవిత్వ రసాల్లో తేలి ఆడేటట్లు చేస్తారు బొల్లోజు బాబా.

వేళ్ళను మట్టి కింద కప్పెట్టిన స్వార్థం, పక్షి పిల్ల సౌందర్యాన్ని తనలో దాచుకున్న గుడ్డు జాణతనం, అద్భుత శిల్పాన్ని ధరించిన రాళ్ల మొండితనం, వీటిని చూస్తూ మది నిండా నింపుకున్నప్పటికీ చిరునవ్వు చాక్లెట్ ఇవ్వనందుకు అందంగా నెపాన్ని ప్రేయసి మీద పెడుతున్నాడు. ఇవ్వకపోయినా గుండె కన్నీళ్ళను కలల కర్చీఫ్ తో తుడుచుకుని హాయి అనుభవిస్తున్నాడు కవి గడుసుతనంగా.

ఎవరో మహానుభావుడు కాసిన్ని అక్షరాల్ని కాలానికి అర్ఘ్యమిస్తాడు. ఊహల ఛాయలతో పిడికెడు ఆలోచనల్ని పుటలపై చల్లుతాడు. ఎవరో (ఆయన కూడా మహానుభావుడే) ఆ పుస్తకాన్ని తన హృదయ కవాటాల్ని తెరుచుకొని అవలోకిస్తాడు. అంతే ఒక సంగీతమేఘం తేనె పాటల్ని వర్షిస్తుంది. అక్కడితో అయిపోలేదు. ఆ రాగ స్పర్శకు మనోయవనికపై ఓ అపరిచిత అరణ్యం మొలకెత్తుతుంది. బొల్లోజు బాబా ఒక రసావిష్కరణ జరిగిపోవడంతో సరిపెట్టుకోడు. పుస్తకంలోకి నడవటాన్ని పరిచిత పాత్రలోకి మనల్ని మనం ఒంపుకునేట్టుగా మలుస్తాడు.

నోస్టాల్జియా తాలూకు జ్ఞాపకాలు కవులకెప్పుడూ ముడిసరుకే. ఇంకో పక్కనుంచి మనవి అనుకున్న అనుభవాల్ని ఏదో రకంగా వెల్లడించి జ్ఞాపకాల్ని శాశ్వత పరచుకోవడానికి కవులు తాపత్రయపడతారు. అందుకు బాబా మినహాయింపు కాదు. అంతర్ముఖీనంగా నిక్షిప్తమైన భావనా శకలాలు 'ఓ నా ప్రియ గృహమా' అంటూ ఎలుగెత్తి చెప్పేలా దృశ్యమానం అయ్యాయి. కాంక్షాతీరాల వెతుకులాటలో పోగొట్టుకున్న గుప్పెడు మట్టిలో నిన్ను నేను కోల్పోయాను అంటూ తనదంటూ అస్తిత్వం ఇంకా అక్కడే చిక్కుకున్నాదని మధనపడతాడు.

వికృత మీడియా సంస్కృతి లో సర్వవ్యాపిత దు ఖానికి మరో కోణం ఉండకూడదనే నిరసననీ, నగరం విసర్జించిన నాగరికతను ఏరిపారేసే పారిశుద్ధ్య కార్మికులనీ, చిల్లుల ఓజోను పొర కప్పుకుని పుండవుతున్న పర్యావరణాన్ని, తనకే స్వంతమైన అచ్చమైన ప్రేమనీ, మానవ సంబంధాల వైరుధ్యంతో చిట్లిపోయిన ఆస్పత్రిలో ఓ చావునీ, రత్యానంతర దేహాల్లో మిగిలిన రోదనా ప్రవాహాన్నీ, రెక్కల టపటపల గమకాన్ని పలికించే పిచ్చుకల అదృశ్యాన్నీ ..... ఒకటేమిటి బొల్లోజు బాబా అనుభవ సాంద్రతలోని అణువణువు కవిత్వమై పరిపూర్ణంగా వికసించే మెట్టు ఎక్కడానికి సిద్ధంగా ఉంది. మానవత్వపు సారాంశంలో స్పందించే గుణం పుష్కలంగా వున్న బాబా మరింత గాఢత సాధించే దాఖలాలు ఇందులో చాలా ఉన్నాయి.

కవి, చరిత్రకారుడైన తండ్రి బొల్లోజు బసవలింగం (సువర్ణశ్రీ) వారసత్వాన్ని అంది పుచ్చుకున్న బాబా గొప్ప నమ్మకాన్ని వాగ్దానాన్నీ ఈ తొలి కవితాసంపుటి ద్వారా ఇస్తున్నందుకు మనసారా అభినందిస్తున్నాను. ఒక గమ్యం దిశగా బాబా పయనం పురోగమించగలదని ఆశిస్తున్నాను.

**దాట్ల దేవదానం రాజు**

యానాం 4-9-09

## ఆకుపచ్చని తడిగీతం

మేఘాలూ నేలా
రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి.
తెల్లవార్లూ వాన కురుస్తూనే ఉంది.

నల్లని మంచుగడ్డ కరిగిపోయింది.
నిశ్చల తరువుల్లోకి ప్రాత్ణ కాలం
తడితడిగా ప్రవేశించింది.
వందగుమ్మాలతో వెదురుపొద
స్వాగతం పలికింది.

సూర్యకిరణాల కిలకిలారావానికి
లిట్మస్ పేపర్‌లా ఆకాశం రంగు మారింది.

తీగమొక్కలు జారిపోయిన పట్టును
మళ్లా వెతుక్కొంటున్నాయి.
తడినేలపై పడి పరావర్తనం చెందిన
లేత కిరణాలు, ఆకుల క్రింద దాక్కొన్న
చీకటిని తరిమేస్తున్నాయి.

చెట్లధూళి వానగుంటలలో చేరి
ఆకుల అందాలను చూస్తూ విస్తుపోతూంది.

మబ్బు అంచుల జరీ మెరుపులతో
పోటీపడే ఈకలకోసమై
ఓ పక్షి శ్రద్ధగా ప్రీనింగ్ చేసుకొంటూంది.

తలంటుకొన్న యవ్వనిలా శోభిస్తున్న
పొగడచెట్టు గాలికిరణాలలో
పత్రాలను ఆరబెట్టుకొంటూంది.

ఉదయపు గొంతులోంచి
ఆకుపచ్చని తడిగీతం
రెక్కలుకట్టి ఎగురుతూంది.
మేఘాలవతల వరకూ
సౌందర్యం పరుచుకొంది.

తటాకం అంతవరకూ భద్రంగా
దాచుకొన్న తామరదుంపకు
కొత్తచిగుళ్ళు లేస్తున్నాయి
నేల ఆలపించే ప్రాచీనగీతాన్ని చిత్రించటానికై.

******

తడిసిన సీతాకోకచిలుక
కవిత్వంపై వాలి రెక్కలల్లార్చింది.

## వెన్నెల నావనెక్కి

హేమంతోత్తరీయాన్ని కప్పుకున్న వనం
ఆకుల కొనల వేలాడే
మంచు బిందువుల భారాన్ని
మోయలేక అలసిపోతోంది.

రాలిన పూలను తురుముకొన్న కాలిబాట
సుగంధాలను గానం చేస్తోంటే
ఇరువైపులా ఉన్న తరువులు
తన్మయత్వంతో తలలూపుతున్నాయ్.

రాత్రి వలలో చిక్కుకున్న పక్షులు
వేకువ జ్ఞాపకాలను స్వప్నిస్తున్నాయి.

నిదురించే లోకం కోసమై
ఆకాశం చుక్కల పహారా పూయించింది.

నిద్రలో శిశువు పెదాలపై
పరచుకొనే నవ్వులా చందమామ
నిర్మలంగా, స్వచ్ఛంగా, ప్రకాశంగా వెలిగిపోతోంది.
చందమామ చుట్టూ ఊదారంగు వరద గుడి
కాంతి రహస్యాలను నాట్యం చేయిస్తోంది.

కనబడకుండా వినిపించే కీచురాళ్ళ కవిత్వానికి
నిశ్శబ్దం మధ్య మధ్యలో ఆహా, ఓహో అంటోంది.

మల్లె ఛాయ వెలుగులో తిరుగాడే మిణుగురులు
పగలు వెలిగే వీధి దీపాల్లా వెలవెలబోతున్నాయి.

సెలయేటి నీరు గులక రాళ్ళతో గలగలా మాట్లాడుతూ
త్రోవ వెంబడి వడివడిగా ప్రవహిస్తూంది.

సముద్రాల కబుర్లనీ, మేఘాల ఊసుల్ని
వానచినుకుల ముచ్చట్లనీ, కల్మషం లేకుండా
చెప్పుకుపోతూన్న అలల పలుకుల్ని
చెవులు రిక్కించి సంభ్రమంతో వింటోంది.
సుమపాత్రికలోని మకరందం.

గవ్వ గుండెలో గిరికీలు కొట్టినప్పటి వడిని
ఇంకా కోల్పోని గాలి వయ్యారంగా
వనమంతా కలియ తిరుగుతూంది.

వెన్నెల నావనెక్కి
రాత్రి ఒంటరిగా సాగిపోతోంది
వేకువ తీరానికై.

సాక్షి ఆదివారం అనుబంధం 3, నవంబరు 2008

## సెలవుల్లో కాలేజీ

సెలవుల్లో కాలేజీ
పక్షులెగిరి పోయిన వేడాంతంగళ్ లా ఉంది.

ఇసుక తుఫానులో తడిసిన
ఖర్జూరపు చెట్టులా
కాలేజీ గదుల కళ్ళపై ధూళి పొర
పరుచుకొంది.

సరస్వతీదేవికి నిద్రా భంగం కాకూడదని కామోసు
ఇస్మాయిల్ + నడచిన చెట్టుపై చిలుకలసందడి
విరామం తీసుకుంది.

ఉపన్యాసాల పావురాళ్ళను
ఎగరేసే తరగతి గదులు
నిర్జించిన పక్షిగూళ్ళై
నిశ్శబ్దాన్ని ధరించాయి.

తమపై వ్రాసిన ప్రేమరాతలను
చదువుకొంటున్న చెక్కబల్లలు
వసంతంలో భ్రమరాలతో తమ సరాగాల్ని
తలపోసుకొంటున్నాయి.

సెలవుల్లో కాలేజీ మొత్తం
విత్తనాలకై ఎండబెట్టిన బీరకాయలా
పొడిపొడిగా ఉంది.

కోతకోసిన వరిచేను దుబ్బుల
జీవరాహిత్యం గ్రవుండులోని
పాదముద్రలలోకి ప్రవహించింది.

విద్యార్థుల్లేని కాలేజీ
తలతెగిన వృక్షంలా, వృక్షాల్ని నరికిన వనంలా
వనాల్ని మింగిన శిశిరంలా ఉంది.
అచ్చు
పగలుచూస్తే రాత్రి కవితలోకొచ్చేలా!

+ప్రముఖ కవి ఇస్మాయిల్ గారు ఈ కాలేజీలో పనిచేసారు.

## మట్టి కనుల నా పల్లె

అపరిచిత ప్రపంచంలో బతకడం అంటే
వసంతాన్ని పారేసుకొన్న తుమ్మెద
ఎడారి కన్నులపై వాలటమే!

ఏ కరచాలనాల ప్రారంభం
ఏ ఆత్మ స్నేహాల వాకిళ్ళు తెరుస్తుందో లేక
పరుచుకోబోయే ఏ విషజాలం అవుతుందో
తెలియని స్థితి.

అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే
జీవితాన్ని అవమానం స్థాయిలో లాగించేయటమే.
ప్రసవించే స్త్రీ, ఆ వేదనలో ఎంత ఒంటరో
అంతే ఏకాకితనం ముసురుకుంటుంది.
మహా సంద్రంలో ఒంటరి నావికుని
మనో రోదనను ఏ ప్రవచనాలు
శాంతింపచేయలేవు.

అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే
మబ్బుల మధ్య గుంపునుకోల్పోయిన
కొంగపిల్ల తుమ్మ చెట్టుకు గాయమై
వేలాడడమే!

ప్రజా సమూహపు సానరాయిపై
గంధపు మాటల చెక్కని అరగదీసి అరగదీసి
నా గుండెకు పరిచయాల లేపనాన్ని పూద్దామంటే
గుండె కనపడదే!

ఒక వేళ
నెరళ్లు తీసిన నా పల్లె మట్టి నయనాల్లో
ఉండి పోయిందా?

ఆంధ్రభూమి సాహితి – 3 నవంబరు 2008

## నువ్వు నువ్వే - నేను నేనే

నేనో పాతిక సంవత్సరాలపాటు
వెతికి వెతికి నిన్ను చేరుకుంటాను.
నువ్వో ఇరవై వసంతాలలో నాకై
చూసి చూసి నన్ను ఆహ్వానిస్తావు.

అంతవరకూ మనం జీవించినకాలమంతా
నిలువునా కుప్పకూలుతుంది.
సహజీవనమనే కొత్త వేషం కడతాం.

శరీరాలు ఒకదానినొకటి
ఎంత వెలిగించుకొని కరిగించుకొన్నా
ఎవరి పరిమళాలు వారివే!

ఎన్ని సాంత్వనలూ, ధైర్యాలూ,
ఓదార్పులూ ఇచ్చి పుచ్చుకొన్నా
ఎడారులూ, ఎడారులకొనల వేలాడే మృగతృష్ణలూ,
నీవి నీవే! నావి నావే!

ఇరువురి ఆశల్ని, ఆశయాల్ని
ఎంత ఒకే తెరపై చిత్రించినా
ఎవరి వర్ణాలు వారివే!

తమ బరువుని తామే
మోసుకుతిరిగే మేఘాల్లా
ఎవరి శ్వాస భారాన్ని వాళ్ళే మోసుకోవాలి.

సముద్రం తరపున నీళ్ళు వకాల్తా తీస్కొని
ఎట్లైతే ఆటుపోట్లని సృష్టించలేదో

అలాగే
ఒకరిదప్పిక, ఆకలి, నొప్పులను
మరొకరు పూరింపలేరు.

ఎన్ని రోజులు కలిపిమండించినా
ఎన్ని రోజాల్ని కలిసి పండించినా
నువ్వు నువ్వే, నేను నేనే.
నేనే నువ్వు అనుకోవటం
నువ్వే నేను అనుకోవటమంత మాయ.

అయినా సరే
లోకం దృష్టిలో మనిద్దరిదీ
ఎప్పటికీ అనోన్యదాంపత్యమే.

## ప్రాడిగల్ సన్స్

కాలేజీ చదువులకని
ఇల్లు విడిచిన పిల్లలు
ఇంకా తిరిగిరాలేదు.

వృద్ధాశ్రమంలో అంతా బాగానే ఉంటుంది.
వేళకు తిండి, వైద్యం, కాలక్షేపం
కానీ
మెలకువ నిద్రపొడవునా వ్యాపిస్తూంటుంది.

చలిచేతుల్ని
అనుభవాలచుట్టూ వేసి
వెచ్చ చేసుకోవాల్సిందే.
జ్ఞాపకాల్ని వింటూ కొవ్వొత్తి
రాత్రిలోకి వలికిపోతుంది.
కాలంనిండా ఘనీభవించిన చీకటి.

ఇసుక గడియారంలోని
ఒంటరి ఎడారి ధార
భారంగా జారుతూంటుంది.

గాలితన బరువుని
చెట్లపై ఈడ్చుకుంటూ సాగుతూంటుంది.

పాద ముద్రలను
కెరటం నోట కరచుకు పోయింది.
మౌనం పంజరంలా
దేహంపై దిగింది.

కాలేజీ చదువులకని
ఇల్లు విడిచిన పిల్లలు వచ్చారు.

ఆవకాయ్.కాం అక్టోబరు 24 2008

## నీ జ్ఞాపకాలు........

విరగ కాచిన వెన్నెల్లో
మరొక్క పొగడపువ్వు కూడా
పట్టేట్టు లేదు.

రాత్రయితే చాలు
ఋతువు తప్పని
వలస పక్షుల్లా
నీ జ్ఞాపకాలు
హృదయంపై వాలతాయి.

హృదయతరువుపై
మరొక్క వసంతంకూడా
పట్టేట్టు లేదు.

చుంబనంలో
మోహావేశంతో
మూసుకొన్న
కన్నియ నయనాల్లా
హృదయం తీయగా
వణుకుతుంది.

పొగడపూల పరిమళంలో
వెన్నెల జలకాలాడుతుంది.

## ఒకానొక రెడ్ లైట్ ఏరియా

ఆ నాలుగురోడ్ల కూడలి
పరాకాష్టకు చేరుకొన్న ఒకానొక
వికృతక్రీడ యొక్క భీభత్సావృత కూపం.

జీవితం లైంగికంగా వ్యాప్తిచెందే
అంటురోగమయినచోట
కన్నెలు మల్లెలవుతాయి
మల్లెలు కత్తులవుతాయి.
ఇక్కడ స్త్రీ చర్మం గజాలెక్కనా
గంటల్లెక్కనా వ్యాపారం చేయబడుతుంది.
ఇక్కడ అసూర్యంపశ్యల మాంసం
దేహాల్లెక్కన వడ్డీకి తిప్పబడుతుంది.

వర్ణ, వర్గ, కుల, మతాలనబడే
సభ్య సమాజపు శిలాతెరలు ఇక్కడ
దేహాలమధ్య  మంచుపొరలు.
కిలికించితాలు, చెక్కిళ్ళ సిగ్గుదొంతరలు,
సుఖమనిపించే విరహాలు, పరిష్వంగపు పులకింతలు,
అన్నీ ఇక్కడి జీవన పరాజితుల
గుండెల్లో కలల శిలాజాలు.

ముత్యం భస్మమయినట్లు
స్వప్న యవ్వనం కాలిపోగానే, వాస్తవం
అనకొండలా  మృత్యుకౌగిలించుకుంటుంది.

పింప్‌లు పిండుకోగా ఈ స్తనాల్లో
మిగిలింది రక్త గడ్డలొక్కటే.
నిత్యం వందల డైనోసార్ పందుల

రత్యనంతరం ఈ దేహాల్లో మిగిలేది
రోదనా ప్రవాహమొక్కటే.
ఈ కసుగాయల చెక్కిళ్ళు చిదిమితే
కారేది పాలు కాదు, ఎయిడ్స్ మాత్రమే.
ఈ ఎడారి కొమ్మలు పుష్పించేదిక
వేదనల బూడిద మాత్రమే.

ప్రపంచ ప్రాచీన వృత్తి ఇక్కడి
ప్రణయోనులకు జీవనాధారమై
అదే మృత్యుదాతయై విరాజిల్లుతూంది.

(ఒకానొక రెడ్ లైట్ ఏరియాను చూసి)

**సార్ గారండీ......... సార్ గారండీ......**

శరీరం మీంచి బాల్యం అదృశ్యమౌతుంది.
దేహంపై యవ్వనం నూనూగుగా మొలకెత్తుతుంది.
దానిగొంతుక వింతైన జీరతో
'సార్ గారండీ, సార్ గారండీ' అంటుంది.

ఆ మాధుర్యానికి ఒక జీవితాన్ని అర్పించుకోవచ్చు.
ఆ అభిమానానికి ఒక హృదయాన్ని అంకితమీయవచ్చు.

వాడు నిర్మించుకొనే వ్యక్తిత్వ హర్మ్యానికి
మేలిమి ఇటుకలను ఎంచి వాడి కందిస్తాను.
వాని ఆలోచనల చురకత్తులు
పదును పెట్టుకోవటానికై
నా మెదడును సానరాయిని చేస్తాను.

పరస్పర వైరుధ్యాల అరణ్యంలో
వాడు దారితప్పి కునారిల్లినపుడు
నా అనుభవాల్ని దిక్సూచిగా చేసి బహూకరిస్తాను.

రసాయినోద్రేకాల ప్రళయకాలంలో
అయితే కుంభవృష్టి లేతే చంద్రగాడ్పులు
తప్ప మధ్యస్థమెరుగని వాడి మనసుకు
ఉదయ లేకిరణాల్ని, వేసవి సాయంకాలాల్ని
మంచుసోనల్ని, వెన్నెల రాత్రుల్ని
పరిచయం చేస్తాను.
ఒక తరం తన నడతను ప్రసవించుకొనే వేళ
నేను మంత్రసాని నౌతాను.

ఈ దేహం కలిసిపోయే లోపు
ఎప్పుడో, ఎక్కడో వాడు కన్పించి
'బాగున్నారా మాష్టారూ' అంటాడు.
అంతకు మించింకేం కావాలీ జీవితానికి.

ఈమాట వెబ్ పత్రిక  నవంబరు 2008

## సిక్స్ పేక్ హృదయం

ఆల్చిప్ప కన్నుతో
మామిడి చెక్కు ఒలిచినట్లుగా
జ్ఞాపకాల ఒక్కోపొరనీ
ఒలుచుకుంటూ పోతే
చివరకు ఒక స్ఫటిక సదృశ
కన్నీటి బిందువు మిగిలింది.

నీ అనంతశయనపు
చిత్తరువుని చూస్తూ
నే రాల్చుకొన్నదే!
దీని తస్సాదియ్యా!  అదింకా ఉందా?

చీకటిని రెండుచేతులతో
బలంగా తోసుకుంటూ
ఎంతదూరం వచ్చేసానూ!

వెలుతురు శబ్ధాల్ని కళ్ళతో
భారంగా పీల్చుకుంటూ
ఎంత కాలాన్ని ఊదేసానూ.

నీడల్ని మాత్రమే ప్రతిధ్వనించే
కాల లోయల్లోకి ఎన్ని రోజువారీ
వెర్రి కేకల్ని గుమ్మరించానూ!
ఎంతైనా
ఇది సిక్స్ పేక్ హృదయం కదా!

## ఒక జ్ఞాపకం

ఏకాంత సాయింకాలపు పలుచని వెలుతురులో
హృదయంలో విరిసిన సన్నజాజుల గానంలా
ఓ జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.

దాచిన రహస్యాలను విప్పిన నూత్న యవ్వన వనాల
పరిమళాలు విరజిమ్మే శీతాకాల రాత్రులలో
నీ సాంగత్యపు కొలిమిలో నన్ను నేను
వెచ్చచేసుకొని, కరిగించుకొని మరిగించుకొనే క్షణాన
వర్షించిన సౌందర్యానందం నిన్నూ నన్నూ
ఆకాశపుటంచులవరకూ  విసిరికొట్టిన
జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.

రొచ్చులు, రోతలూ, రేషన్లు, నెలసరి వాయిదాలూ,
ఇంకా కబళించని రోజులలో
వెన్నెల పిట్టలు వాలిన పొగడ చెట్టు క్రింద
రాలిపడే పొగడపూల వానలో తడుస్తూ
పెదవులతో దేహ వీణియలను మీటుకుంటూ
ఆ గానలోకంలో విచ్చలవిడిగా విహరించి
కనిపెట్టిన రహస్యాలను దాచుకొంటూ
దోచుకొంటూ, పంచుకొంటూ పరువులిడిన దూరాల
జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.

పోటీలు, పోలికలూ, పథకాలు, పన్నాగాల వలల్లో
ఇంకా చిక్కుకోని ఆ అకలుషిత దినాల్లో
పట్టుకుచ్చులతో స్పృశించే నారింజ కాంతుల రాత్రిలో
వాంఛ, అంగీకారం పెనవేసుకొన్న క్షణాన
నీ కురుల మల్లియలను కాల్చేలా నా శ్వాస జ్వలించే వేళ
విచ్చుకొన్న పెదవులు, సగం మూసిన కనులతో
నీ సౌందర్యం మెత్తగా నా హృదయంపై పరుచుకొన్నప్పుడు
ఒక అదృశ్యహస్తం నిన్నూ నన్నూ ఎత్తుకపోయి
కాలరహిత, ఆలోచనారహిత, చేతనారహిత, స్థితిలో కప్పెట్టిన
జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.

******

స్కూలు ఫీజ్ కట్టటానికి రేపేలోంది ఆఖరురోజు
సాయింత్రం చంటిదాన్ని హాస్పటల్ కి తీసుకెళ్ళాలి
జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.
వాస్తవం ములు గర్రై పొడుస్తుంది.

ఆవకాయ్.కాం ఫిబ్రవరి 24 2009

## జీవితం

కళ్ళు తెరచి చూసే సరికి
నేనో సమూహంలో నడుస్తూ ఉన్నాను.
ఇరుకైన బాటగుండా ప్రయాణం బాగానే సాగుతూంది.
కనుచూపు మేరలో బాట పొడవునా జనమే.
నా వెనుక సమూహం కొద్దికొద్దిగా పెరుగుతూ పోతోంది.
ముందూ వెనుకా నాలానే చాలామంది
కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.
అలాగని పెద్ద కష్టంగా ఏమీ లేదు.
నలుగురి మధ్యలో నడక అట్టే
అలసట అనిపించటం లేదు.
ఇంతలో ఒక సందేహం కలిగింది.
నా ముందాయన్ని అడిగాను
'ఈ బాట ఎక్కడికి పోతుంది' అని
నా వైపు అనుమానంగా చూస్తూ
'మరో పెద్ద బాటలో కలుస్తుంది' అన్నాడు తాపీగా.
'అదెక్కడికి పోతుంది?'
'తెలీదు' అన్నాడతను అసహనంగా.

అదిరి పడ్డాను.
గమ్యం తెలియని ప్రయాణం
అర్ధరహిత మనిపించింది.
ఎక్కడకు వెళ్తున్నామో కూడా తెలియనితనం
ఫక్తు అవివేకమనిపించింది.
సహజాతంగా కదలిపోతున్న సమూహం
మూర్తీభవించిన మూఢత్వంలా అనిపించింది.
గమ్యం తెలియని గమనం చేయాలనిపించలేదు.
'ఈ సమూహం నుండి బయటపడేదెలా?' అనడిగా.
మరో బాటన ప్రయాణం చేస్తున్నవాళ్ళను చూపుతూ
'ఇక్కడినుండి వెళ్ళిపోవాలనుకొనే వాళ్ళ గుంపు అది' అన్నాడు.
నేనా సమూహంలో కలిసాను.
ఇరుకైన బాటగుండా ప్రయాణం బాగానే సాగుతుంది.
కనుచూపు మేరలో బాట పొడవునా జనమే.
నా వెనుక సమూహం కొద్దికొద్దిగా పెరుగుతూ పోతోంది.

(Life is nothing but skipping from one routine to another అంటూ ఓ రాత్రంతా వాదించిన నా బాల్య మిత్రుడిచ్చిన స్ఫూర్తితో)

## మా అమ్మాయి

నా భార్య స్వెట్టర్ అల్లుతోంది
రాబోయే బిడ్డకోసం.

ఇంట్లోకి వసంతం
పూవుల్నీ, సీతాకోకచిలుకల్నీ
సుగంధాల్నీ వెంటేసుకొచ్చింది.

ఆకాశం రాల్చిన పారిజాత సుమంలా
మా నట్టింట పాపాయి చందమామై వెలగసాగింది.

ఎదపై నడయాడిన మెత్తని పాదాలు
నెమలీక స్పర్శలను, గజ్జెల కవిత్వాన్ని
హృదయంపై వదిలిపోతాయి.
ముద్దు ముద్దు మాటలు
హృదయాన్ని చుంబించే వెన్నెల చినుకుల్లా
హాయి కాంతులు విరజిమ్మాయి.

చిన్నారి దేహం పుష్పించిననాటినుండీ
పూడికతీయని బావిలా
మా గుండె బరువెక్కుతూనే ఉంది.

ఏనుగాటలు, ఉప్పు మూటలు ఆడిన బాల్యం
హఠాత్తుగా అదృశ్యమై
నిలువెత్తు యవ్వనం ప్రత్యక్షమౌతుంది.
అది వాళ్ళమ్మనడిగి
స్వెట్టర్ ఎలా అల్లాలో నేర్చుకొంటూంది.

ఇల్లు నిర్మించుకోమ్మని పంపించివేసే వేడుకలో
అవసరాతీతంగా హర్షం వర్షిస్తుంది.

కలల రెక్కలు తొడుక్కొన్న పిల్లలకు
గూడు వీడ్కోలు పలుకుతుంది.

జననమప్పుడు తల్లి గర్భసంచి లోపొరను
గుంజుకుపోయిన బొడ్డుతాడులా
హృదయంలోకి చొచ్చుకుపోయిన
వేళ్ళని పెరుక్కొని పోతుందా పసుపుతాడు.

ఏకాంతంలోకి జారిన వర్తమానం
పల్లేరుకాయలా గుచ్చుకొంటూ ఉంటుంది.
అత్తరు అద్దిన శాలువా పెట్టె
తెరచినపుడల్లా జ్ఞాపకాల పరిమళాలు
కువకువలాడుతూ ఎగురుతూంటాయి.
స్వప్నదారులలో గజ్జెల సవ్వడి
ఎంత ప్రయత్నించినా నిద్రపోనివ్వదు.
++++
ఇంతలో ఒక శుభవార్త
మా అమ్మాయి స్వెట్టర్ అల్లుతోందట.

## అన్నీ ఒకేలా ఉంటాయి

ప్రతీదీ ఎక్కడో చూసినట్లే ఉంటుంది.
ఎప్పుడో అనుభవించినట్లే ఉంటుంది.

అన్నీ ఒకేలా ఉంటాయి.
ఉదయాలు, మరణాలు
విజయాలు, వేదనలు
ఎత్తుగడలు, దొరికిపోవటాలు
కలలూ, కన్నీళ్ళూ, బంధాలు, ప్రేమలూ,
అన్నీ ఒకేలా ఉంటాయి.

ప్రతీదీ ఎప్పుడో ఒకప్పుడు
స్వప్నించినట్లే ఉంటుంది.

అవును, కాదు
కావొచ్చు, అప్పుడప్పుడూ,
లాంటి మాటల మధ్య జీవితం
గానుగెద్దులా తిరుగుతుందన్న విషయం
ఎపుడో ధ్యానించినట్లే ఉంటుంది.

పంజరపక్షి పదే పదే వినిపించే గానంలా
జీవితం కనే కలలు
ఎప్పుడూ ఒకేలా ధ్వనిస్తాయి.

ఏం చదివినా
అవే అక్షరాలు, అవే అర్థాలు
పునరావృతమైనట్లే అగుపిస్తాయి.

ఆఖరుకు
కాలం దిబ్బపై మొలచిన
పిచ్చి మొక్కలు కూడా
క్లోన్డ్ సంతతిలా అనిపిస్తాయి.

కవితా! మాసపత్రిక నవంబరు 2009 సంచిక

## సౌందర్యం

సెలయేటి ఎగువన ఎవరో
నీటిలో వెన్నెల బిందువుల్ని
కలిపారు.

సెలయేరు పొడవునా వెన్నెలే!

నీరు తాగాలని వంగితే
దోసిట్లో చందమామ.

కవితా! మాసపత్రిక డిసెంబరు 2008 సంచిక

## పక్కింటబ్బాయి ఆత్మహత్యాయత్నం

మా పక్కింటబ్బాయి
నిన్న రాత్రి ఆత్మహత్యాయత్నం చేసాట్ట.
'పరామర్శించటానికై' వెళ్ళా
ఏరా అబ్బాయ్ ఏం జరిగిందీ అంటే
మధుకలశం విషపాత్రికైందన్నాడు.
సైకత సౌధాలను గాలిమమ్మ తన్నుకుపోయిందన్నాడు.
కనిపించని గోడలకు గుద్దుకొని ఆలోచనలు
ముక్క ముక్కలై రాలిపోయాయన్నాడు.
అలా వాడు ఎవేవో అంటూనే ఉన్నాడు.
నేనేం మాట్లాడలేదు.
వాడి భుజంపై చేయివేసి
'పదరా అబ్బాయ్ అలా లోకం చూసొద్దాం'
అంటూ బయటకు తీసుకొచ్చాను.

******

తల టైరుక్రింద కొబ్బరికాయై 'ఠాప్' మని పగలగా
దేహం ప్రశాంతంగా పవళిస్తూఉంది. పక్కనే
ఓ మనసు అప్పటికే సహగమనం చేసేసింది.
మృతుని కూతురి లేత యవ్వనాన్ని అద్దెకు తిప్పటానికై
కొన్ని కళ్ళు పథకాలు రచిస్తున్నాయి.

దగ్ధభోగీ లోంచి దింపిన, పచ్చి కట్టెలా పూర్తిగా కాలని
దేహాలు ప్రశాంతంగా పవళిస్తూ ఉన్నాయి. పక్కనే
ఓ తల్లి తన కొడుకు దేహం కోసం వెతుకులాట.
కాలిన కొడుకు దేహాన్ని అప్పటికే లక్ష సార్లు చూసినా
పోల్చుకోలేక పోవటం ఓ జీవితకాల విషాదం.

ఇంతకాలం ఆ వృద్ధదంపతులకు చేతికర్రై పరిమళించిన
కొడుకును కాన్సర్ కౌగిలించుకోగా
దేహం ప్రశాంతంగా పవళిస్తూనే ఉంది. పక్కనే
వృద్ధ దేహాల్లోకి మెల్లగా నల్లని ఒంటరితనం ఎగబాకుతూంది.

సరిహద్దుల్లో వేయి ఫిరంగులు పేల్చిన
యోధుణ్ణి ఒక్క బుల్లెట్ ముద్దాడింది.
దేహం ప్రశాంతంగా పవళిస్తూనే ఉంది. పక్కనే
ఒక కుటుంబం రెక్కతెగిన పిట్టలా
గిరికీలు కొడుతూ నేలకూలింది.
శోకంతో ఒక జాతిమొత్తం
ఒత్తికింది మైనంలా కరిగింది.

పాశవిక రేప్ అనంతరం పైశాచికంగా చంపబడ్డ విద్యార్ధిని
దేహం ప్రశాంతంగా పవళిస్తూనే ఉంది. పక్కనే
ఆకాశమంత ఆక్రోశాన్ని, సముద్రమంత బాధనీ
జ్వలింపచేసుకొన్న హృదయచితి ఇంకా కాలుతూనే ఉంది.
నక్షత్రాలన్ని అశ్రుబిందువుల్ని రాల్చుకొన్న నేత్రాలు నెరళ్ళు తీసి
నెరనెరలో దిగులు మొలకలు లేస్తూనే ఉన్నాయి.

******

పార్ధివ దేహాలెప్పుడూ
ప్రశాంతంగా పవళిస్తూనే ఉంటాయిరా అబ్బాయ్
నడిచే దేహాలు మాత్రరా ఆ అకస్మిక వియోగ
విషాదంలో ప్రయాణిస్తూనే ఉండాలి.

హఠాన్మరణం వెనుకే ఇంత విషాదం ఉన్నప్పుడు
బలవన్మరణం వెనుక ఇంకెంత ఉంటుందో తెలుసా నీకు?
నీ బాధల్నీ, దైన్యాన్ని, పగిలిన హృదయాన్ని
మరొకరిలోకి బట్వాడా చేస్తున్నావన్న విషయం నీకు తెలియదు.
నీ ఆక్రోశాన్ని, ఆవేదనను, భాధ్యతలనీ, జ్ఞాపకాలని
నీవు చేసిన శూన్యాన్ని
నీ వాళ్ళు జీవితాంతం మోసుకు తిరగాల్సిఉంటుంది.

******

మా పక్కింటబ్బాయి పశ్చాత్తాపం
వాని కళ్ళను నీళ్ళ మడుగు చేసింది.

## బి.సి. అంటే ఎవరు నాన్నా

బి.సి. అంటే ఎవరు నాన్నా?
అని నా కూతురడిగినపుడు ఏమని చెప్పను?

అద్దకం పనిలో రంగుల్లోని సీసం
బొట్లు బొట్లుగా ఎముకల్లో చేరి
నిర్వీర్యమయినవాడని చెప్పనా లేక

బంగారాన్ని కొట్టి కొట్టి భుజం బంతిగిన్ని కీలు
అరిగిపోగా చేయి ఎత్తలేని స్థితిలో
పస్తులుంటున్న వాడని చెప్పనా?

ఆస్బెస్టాస్ రేణువులు ఊపిరితిత్తులను
తూట్లు పొడవగా దగ్గుతూ రొప్పుతూ
వాటినే తోలు తిత్తులుగా చేసి
కొలిమిని మండిస్తున్న వాడని చెప్పనా?

లోహపాత్రల ఇంద్రజాలంలో
తన జీవనాధారం మాయమవగా
మట్టిగరుస్తున్న మృత్తిక కళాకారుడని చెప్పనా? లేక

నరం తెగిన జీవితపు
రక్తాన్ని పీల్చే స్పాంజి పరుపు దాడిలో
దూదిలా కాలుతూన్న దూదేకులస్థుడననా!

సాయింత్రం తిరిగొస్తేనే బతికున్నట్టుగా
లెక్కింపబడే సముద్ర జాలరి దినదిన గండ జీవితానికి
పొడిగింపుగా మిగిలిన వారసుడని చెప్పనా?

ప్రమాదవశాత్తూ పట్టుతప్పి గాల్లో వేళ్ళాడుతూ
ప్రాణలొదిలిన గీతకార్మికుడని చెప్పనా?
సమాజానికే స్తన్యమిస్తూన్న యాదవుడననా లేక
దేహాలకో ఆకారాన్ని, అంతస్థునీ ఇచ్చే రజకుడననా?

ద్రోణాచార్యుడు ఒక వేలే అడిగాడు కానీ
పారిశ్రామిక విప్లవాచార్యుడు కోరిన
వేన వేళ్ళ దేహాల సంతతి అని చెప్పనా?

ఏమని చెప్పాలి నా కూతురికి
బి.సి. అంటే ఎవరని చెప్పాలి?
నేనెవరు అంటే ఏమని ఆవిష్కరించాలి?

శ్మశానంలా తీసుకోవటమే కానీ ఇవ్వటం తెలీని
ఈ సమాజానికి తరతరాలుగా అందిస్తూనే ఉన్న
ఈ జీవిని ఎలా నిర్వచించాలి?

## ఒకే ఒక ఆశ చాలు.........

వనంలో కార్చిచ్చు కదిలింది.
అగ్నికీలలు వేన వేల నాలుకలతో
ఊగిపోతున్నాయి.
చెట్ల ఆకులు, పూవులూ
వసివాడని మొగ్గలూ
మసివాడి పోయాయి.
పక్షులు ప్రశాంతతీరాలకై
ఎగిరిపోయాయి.
వేడిని తాళలేక
పులుగూ, పుట్రా పరుగులెట్టాయ్.

అరణ్యం అగ్ని దుప్పటి
కప్పుకున్నట్లుంది.
పచ్చని దృశ్య విధ్వంసం పూర్తయింది.
******
మనసుకు ఒక
అపజయం గుచ్చుకుంది.

వేన వేల నిరాశానీడలు
కదలాడుతున్నాయి.
స్వప్నాలు, సౌరభాలూ
మసివాడిపోయాయి.
సుఖ సంతోషాలు
విలాస విలాసాలకై ఎగిరిపోయాయ్.
నిస్పృహ బూడిద
హృదంతరంలో పరచుకొంది.

వెచ్చని దృశ్యం భళ్ళున బద్దలయింది.
******
ఆ మరునాడు
వనంలో మిగిలిన
ఒకే ఒక విత్తనం పగిలింది
పున్ణ సృష్టి జరపడానికై.

ఆ మరునాడు
మదిలో జనించిన
ఒకే ఒక ఆశ రగిలింది
పునరుజ్జీవనం ఇవ్వటానికై.

**యూజర్ నేమ్: మనిషి - పాస్ వర్డ్: మానవత్వం**

ఓ యూజర్ నేమూ, పాస్ వర్డూ ఇచ్చి
దేముడు నన్నీ లోకంలోకి దించాడు.
పాస్‌వర్డెక్కడ మరచిపోతానోనని
హృదయంపై పచ్చబొట్టుగా వేయించుకొన్నాను కూడా.

బాల్యం వరకూ హృదయం నాతోనే ఉంది.
ఆ తరువాతే కనిపించకుండా పోయింది.
ఎక్కడైనా పారేసుకొన్నానో లేక
ఎవరైనా ఎత్తుకుపోయారో నాకు గుర్తులేదు.
అక్కడినుండే కష్టాలు మొదలయ్యాయి.

పచ్చని తీరాలకై నే వలసపోయేప్పుడు
అప్పటిదాకా నన్ను రెప్పలా కాపాడిన
నాలుగు వృద్ధ నయనాల జల భాషను
డీకోడ్ చెయ్యలేక పోయాను- పాస్ వర్డ్ లేక.

కెరీర్ కడ్డం పడుతుందని
చిదిపించేసిన రెండునెలల పిండం
ఏదో చెప్ప ప్రయత్నించింది.
రాంగ్ పాస్ వర్డ్  ఆడియో ఫైల్యూర్.

'తాతయ్య పోయినపుడు నువ్వూ, పెదనాన్నా
ఎందుకు దెబ్బలాడుకున్నారు' అని
ఆర్థిక మర్మాలు తెలియని నా కూతురడిగినపుడు
పాస్ వర్డ్ మర్చిపోవటం వల్లేనని
చెప్పలేకపోయాను.

అంతెందుకు
శ్రీశ్రీ వర్ణించిన బిచ్చగత్తె ప్రతీరోజూ
నా ఒక్కరి ముందే చేయి చాపుతాది.
పాస్‌వర్డ్ లేదని పర్సు తెరచుకోదు.

అంతా తెలుస్తూనే ఉంది
కానీ ఏమీ చెయ్యలేనితనం.

జీవితం ఫోల్డర్ లోని శాంతి అనే ఫైలు
ఎంత ప్రయత్నించినా తెరుచుకోవటం లేదు.

దేవుడా!
దయచేసి నా పాస్ వర్డ్
రిట్రీవ్ చేసి పెట్టవూ?

**పుస్తకంలోకి నడవటం అంటే.......**

ఎప్పుడో, ఎక్కడో, ఎవరో
ఒకడు
దోసెడు అక్షరాల్ని
కాలానికి అర్ఘ్యమిస్తాడు.
పిడికెడు ఆలోచనల్ని ఒడిసిపట్టుకొని
పుస్తకపుటలపై చల్లుతాడు.

ఎప్పుడో, ఎక్కడో, ఎవరో
ఒకడు
ఆ పుస్తకాన్ని తెరుస్తాడు.

ఒక జీవనది వాని గుండెల్లోకి
ప్రవహించటం మొదలౌతుంది.

ఒక సంగీతమేఘం
తేనె పాటల్ని వర్షిస్తూంటుంది.
ఆ రాగ స్పర్శకు వాని మనో యవనికపై
ఓ అపరిచిత అరణ్యం మొలకెత్తుతుంది.
వేన వేల స్వప్నాల పిట్టలు
రివ్వుమంటూ ఎగిరి వచ్చి
మనో వనాన వాల్తాయి.
వసంతపు మొగ్గలు
పువ్వులుగా బద్దలవుతాయి.
పరిమళపు భ్రమరాలు ఝుమ్మంటో
వాడిని చుట్టుముడతాయి.

దివా సంధ్యలు, గెలుపోటములు
సుఖ్ఖదుఃఖాలు, రాగ ద్వేషాలు
అనుభూతి తరువులపై వాలిన
జంట పిచ్చుకలౌతాయి.

కెలడియోస్కోపులోని
రంగు రంగు గాజు ముక్కలల్లే
అవే అక్షరాలు అసంఖ్యాక చిత్రాల్ని
ఆవిష్కరిస్తూంటాయి.
ఒక నన్నయ, ఒక వేమన, ఒక గురజాడ
లిప్తపాటు మెరిసి మాయమవుతారు.

నవరసాలూ వాటి దేహాల్ని లాక్కొచ్చి
కనుల వాకిట నిలిపి
రసావిష్కరణ జరిపిస్తాయి.

శత సహస్ర శిరచ్ఛేద
ఖడ్గ పరిహాసం తళుక్కుమంటుంది.

తరాల్ని కలిపే రుధిరామృతం
కాలరేఖపై లీలగా జారుతుంది.

******

ఏదైనా ఓ పుస్తకంలోకి నడవటమంటే
పరిచిత పాత్రలలోకి
మనల్ని మనం ఒంపుకోవటమే కదా!

## పెయింటరు

ఒకప్పుడు
గోడలు, బేనర్లు, సైన్ బోర్డులు
కటౌట్లపై వాడి సంతకం
ఆకాశం అంచున వేలాడే సూర్య బింబంలా
వెలిగిపోతూండేది.

నీలిమందు నీళ్ళల్లో ముంచిన పురికొస సాయంతో
వాడు గీసిన సరళ రేఖల మధ్య అక్షరాలు
గూటిలోని గువ్వల్లా ఒదిగిపోయేవి.

కుంచెలోని ఉడుత వెంట్రుకల మధ్య వర్ణాలు
సుశిక్షిత సైనిక కవాతులా కదిలేవి.

బేసిక్ కలర్స్ నుంచి డిరైవ్డ్ రంగుల్ని
సృష్టించటం వాడికి మాత్రమే తెలిసిన ఓ రసవిద్య.

అతడు గీసిన చిత్రాల ముందు
ఎవరెవరో పారేసుకొన్న
ఓ పది పన్నెండు కళ్ళూ, రెండు మూడు హృదయాలు
ప్రతీరోజూ తుడుపులో దొరుకుతూండేవి.
కొత్తవారికి వాడిరాతలు
నిశ్శబ్దంగా, నిర్దుష్టంగా దారిచూపేవి.

వాడి చెక్క పెట్టి నిండా రంగురంగుల డబ్బాలే!
ఇంద్రధనస్సుని నిలువునా చీరి
ఒక్కో ముక్కనీ ఒక్కో డబ్బాలో వేసుకొన్నాడా అనిపించేది.
పెట్టెలో వివిధ సైజుల్లో బ్రష్ లుండేవి.
సన్నని గీతనుండి, ఆకాశమంత పెద్ద రేఖ వరకూ
గీయటానికై.
వాని బట్టలపై, వంటిపై, హృదయంపై
చిలికిన రంగుల మరకలు
వాడికో గొప్ప దివ్యత్వాన్నిస్తున్నట్లు
మురిసిపోయేవి.

కానీ ఇప్పుడు
వినైల్ ప్రింట్లు, ఫ్లెక్స్ బేనర్లు
ఫొటోషాపులు, కోరల్‌డ్రాలు
అన్ని వైపుల్నుంచీ కమ్ముకొనే
శీతవేళలా వాడిని మింగేసాయ్.
వాడి ఉపాధి స్వప్నంలా జారిపోయింది.

వాని జీవితంలోకి
థిన్నర్ కలుపని చిక్కని నల్లరంగు ఎగజిమ్మింది.
ఎప్పుడో ఎక్కడో వాడు
రోడ్డుపై క్రీస్తులానో, సాయిబాబాలానో
కళాత్మకంగా మన దారి కడ్డంపడతాడు.
ఇంకేం చేయాలో తెలియక!

(పెయింటర్ మిత్రుడు కీ.శే. పట్నాల రమణ ప్రసాద్‌కు)
వెబ్‌పత్రిక తెలుగుజ్యోతి సెప్టెంబరు అక్టోబరు 2008 సంచిక

## ఓ నా ప్రియ గృహమా!

(నే పుట్టి పెరిగిన ఇంటికి వెళ్ళినపుడు)

ఓ నా ప్రియ గృహమా!
నీ జుట్టులోకి వేళ్ళూన్చి నిమిరి
నాలుగేళ్ళవుతుంది.

నిన్నెంత ఇష్టపడుతున్నానో
నీ వియోగంలోనే క్లారిటీ వచ్చింది.
నీలోకి నడవటం అంటే
నా ఆత్మలోకం లో సంచరించటమే.

'రేపు మీ రిజల్ట్స్ వస్తాయట' తెలిసిందా అంటూ
నాన్నింకా బాధ్యతల్ని
గుర్తుచేస్తున్నట్లే ఉంది.
'వంటయిపోయింది వడ్డించేయమంటావా' అంటూ
అమ్మింకా కడుపు తడుముతున్నట్లే ఉంది.

కట్టె కాలగా మిగిలిన బూడిద రూపంలా గతం.
గోడల నిండా జ్ఞాపకాలు,
గదులనిండా అనుభవాలు.
నిశ్శబ్దంలోకి పురాస్మృతులు ప్రవహించాయి.
ఉద్విగ్నంతో గాలి వణికింది.

ఒక తరం వెళ్ళిపోయింది.
క్యూ కొంచెం ముందుకు జరిగింది.
ఒక శకం ముగిసింది.
కాలం ఆకుల స్వప్నాలు రాల్చుకుంది.

హృదయానికి వేలాడే జ్ఞాపకాలు
మనసుని చీల్చుకొని వచ్చే పాత గురుతులు
చెట్టు పీల్చుకొన్న సూర్యరశ్మెక్కడికి పోగలదు?

ఇక్కడే కదా
నిస్సహాయతకు, ఉత్సుకతకూ మధ్యెక్కడో
నా శైశవం పుష్పించింది.
ఇక్కడే కదా
భుజానికి తగిలించిన స్కూలు బేగ్‌కి
భుజానికెత్తుకున్న బాధ్యతకూ మధ్యెక్కడో
నా బాల్యం ఒలికిన అత్తరయ్యింది.
ఇక్కడే కదా
రసాయిన కల్లోల కడలికీ
నిశ్చల తటాకానికీ మధ్యెక్కడో
నా యవ్వనం శలవుతీసుకుంది.

కాంక్షా తీరాల వెతుకులాటలో
నే పోగొట్టుకొన్న గుప్పెడు మట్టిలో
నిన్ను నేను కోల్పోయాను.
కానీ
నీ సాంగత్య జాలంలో నా అస్థిత్వ శకలాలు
ఇంకా చిక్కుకొనే ఉన్నాయ్.

## కొంచెం ఇటు తిరిగి ఏడవండి.

(కుటుంబ సభ్యుడు చనిపోగా ఆ షాక్‌లో దు:ఖంతో ఏడుస్తున్న ఒకరిని 'కొంచెం ఇటు తిరిగి ఏడవండి ప్లీజ్ ' అన్నాట్ట ఓ టీవీ చానెల్ రిపోర్టర్ – ఆంధ్రజ్యోతి దినపత్రిక 16/5/2008 )

గుండె నెత్తిన పడిన పిడుగు రేపిన
బూడిదను కళ్ళు వర్షిస్తున్నాయి.
శోకతటాకానికి గండిపడి కన్నీటి మట్టం
ప్రమాద స్థాయిలను దాటిపోయింది.

విధి వెలిగించిన దుఃఖ జ్వాల
సర్వం దహించగా
రోదన వాసన గుప్పుమంటుంది.
ఏడుపు బాష్పవాయువై గదంతా పరచుకొంది.

ఇంతలో
'కొంచెం ఇటు తిరిగి ఏడవండి ప్లీజ్ ' అన్న నీ మాట
మానవత్వపు చన్మొనపై కాల్చిన మేకులా దిగింది.
జీవితపు కనుపాపపై మందుపాతరలా పేలింది.
కెమేరా కన్ను విస్తుపోయి చూస్తూండి పోయింది.

నాకు తెలియకడుగుతాను తమ్ముడూ
సెన్సేషన్‌ని, సెక్సుని, భక్తిని, భయాల్నీ లాగే
ఏడుపుని కూడా ప్రేక్షకులకు
అందంగా అందించాలనుకొన్నావా?

శోకం ఒక జ్వాలా ప్రవాహం
శోకం ఒక నిప్పుల ఉప్పెన
శోకం ఒక కుంభవృష్టి
పట్టి ప్యాకింగు చేయగలవా?

శంఖుస్థాపనలు, బహుమతి ప్రదానాలు,
నంగి ముంగి కబుర్ల ఇంటర్వ్యూలు,
కల్లబొల్లి మాటల ఉపన్యాసాలు తీసి తీసి
ఏడుపుని కూడా
మంచి యాంగిల్లో తియ్యాలనిపించిందా?

దుఃఖానికి ఏంగిల్ ఉండదు తమ్ముడూ
అదో మహావలయం
సర్వవ్యాపితం, సర్వశక్తి మయం.

## నిర్మాల్యం

రాత్రి వేళలో నగరాల్ని శుభ్రంచేసే వారిపై)
ఒక పగలు ముదుసలై కాల గర్భంలో కలసిపోయాకా
వాళ్ళు రోడ్లపై గంగానదీ ప్రవాహమౌతారు.
మనమేమో
ఆ రోజు అనలేకపోయిన మాటలను
చెయ్యలేకపోయిన పనులను కలలు కలలుగా
నెమరువేసుకొంటూంటాం.
దేహం నిద్రాదేవి పొత్తిళ్ళలో పాపాయవుతుంది.
వాళ్ళు మాత్రం
నగరం విసర్జించిన నాగరికతను
ఏరిపారేస్తూంటారు.

నిషిద్ధ కారీబ్యాగుల్ని, వ్యర్ధజీవాల్ని, జీవ వ్యర్థాల్ని
పుటుక ధన్యమైందనుకొంటున్న సిగరెట్ పీకల్ని
గుట్కా సాషేల్ని, కిళ్ళీ పెంటికల్ని
కన్యాత్వాన్ని కోల్పోయిన కండోముల్నీ
మత్తు వదిలించుకొన్న మద్యం బాటిళ్ళని
చరిత్రలో కలసిపోయిన వార్తల శకలాల్ని
ప్లాస్టిక్ పువ్వుల్ని, నవ్వుల్ని, లవ్వుల్ని ఒకటేమిటి
నగరం విసర్జించిన నాగరికతను
వాళ్ళు ఏరిపారేస్తూంటారు.

దేవదేవుని ప్రసాదాన్ని అందరికీ తినిపించిన
పాలిథీను అడ్డాకుల్ని, భక్తిమైకు నిశ్శబ్దతని
పిల్లవాణ్ణి స్కూలుకు వెళ్ళేలా చేసిన చాక్లెట్ల రేపర్లని
పెన్ను ముక్కల్ని, జ్ఞానభారానికి అలసిన కన్నీటి చుక్కల్ని
ఇంజక్షను సిరంజీల్ని, బాధల బేండేజీల్ని
అబార్షన్డ్ శిశువునీ, రక్తాన్ని, చీమునీ, దు్ఖాన్ని, దోపిడీని
ప్లాస్టిక్ విస్తరాకుపై మిగిలిన మెతుకుల్ని
వాహనాల గొ్రుకు ఉక్కిరిబిక్కిరై
పండుటాకుతో కలిసి రాలిపోయిన పచ్చనాకునీ
ఒకటేమిటి
నగరం విసర్జించిన నాగరికతను
వాళ్ళు చీపుళ్ళతో, తట్టలతో ఏరిపారేస్తారు.

అపుడు నగరం స్నానం చేసినంత ఫ్రెష్‌గా తయారై
మరో రేపు (రేప్ ?) కి సిద్ధమవుతుంది.

## ఉదయగీతం

దినం యవ్వనంతో ఉన్నవేళ
పెదవులు హృదయ రహస్యాల్ని
దాచలేవు.
జాజుల వాసనకు తనువు
సాంద్రరూపమౌతుంది.
ప్రణయతేజం దేహాల్ని
ప్రకాశింపచేస్తూంటే
జ్వలిస్తూ, దహిస్తూ
తపిస్తూ, తరిస్తూ
వలపుల కొలిమిలో
జంటగా ద్రవించటం
సృష్టి రహస్య చామరం.

## అచ్చంగా నాదే!

వనమంతా విచ్చుకున్న వసంతం
తేనెలో ముంచితీసినట్లుండే కోకిల గానం
యవ్వన నిగారింపుతో మిడిసిపడే సుమాలు
పుప్పొడి పూసుకొని మత్తుగా తిరిగే తుమ్మెదలు
ఇవన్నీ నావి మాత్రమే కావు
నాకు మాత్రమే సొంతం కావు.

ఉదయాన్నే తలుపుతట్టే వెచ్చని లేతకిరణాలు
మట్టి వాసనను గుప్పుమనిపించే సాయంకాలపు వాన
ఆకాశం అప్పుడప్పుడూ పుష్పించే వరదగుడులు
రాత్రికి తెరలేచింతరువాత చల్లగా వీచే వెన్నెల గాలి
ఇవన్నీ నావి మాత్రమే కావు
నాకు మాత్రమే సొంతం కావు.

నా గుండెలో సుళ్ళు తిరిగే
కలలు, కన్నీళ్లు, ఆశలు, ఆవేశాలు
నా చుట్టూ మొలచిన
బాధ్యతలు, బరువులు, బంధాలు, భయాలు
పూర్తిగా నావి మాత్రమే కావు.
వాటిలో దేవుడికి కూడా వాటాఉంది.

అయితే
నీకై దాచిపెట్టిన నా ప్రేమ మాత్రం
అచ్చంగా నాదే!
నీ పట్ల నేను చూపే సంకల్పం మాత్రం
స్వచ్ఛంగా నాదే!

## మృత మన్ను

ఎన్నో భావాల్ని పలికించిన ఈ నేత్రాలు అభావమైన దృశ్యం
గాలిని పదాలుగా, నవ్వులుగా, ఆశలుగా, ప్రేమలుగా
మార్చిన ఈ స్వరతంత్రులు నిర్జీవమైన వేళ.......
ఇక ఈ చెవులు తీతువుపిట్ట సుదూరగానం వినలేవు.
వాన జల్లుల శబ్దాలను స్పర్శించలేవు.
ఈ వీధి గాయకుని అస్థిపంజరమిక
మట్టిపొరల క్రిందే పడి ఉంటుంది.
తన నీడల్లోకే నా నేస్తం కనుమరుగయ్యాడు.

ప్రజలందరూ వెలుగు ప్రపంచంలోకి ప్రవహిస్తుండగా
ఈ ఖాళీ రాత్రిలోంచి నీ జ్ఞాపకాలు ఉదయిస్తాయి.
ఆ నీడల మధ్య తచ్చాడుతూ నేను.......
హృదయంపై భోరున ఒకటే కుంభ వృష్టి.

వయసు పెరగడమంటే మనం ప్రేమించే వాళ్ళను
ఒక్కొక్కళ్ళనూ కోల్పోవటం కాదూ........
'బాధపడుతూ కూర్చుంటే జీవితం ఆగిపోదట
సాగిపోతూనే ఉంటుందట' ఎవరో అంటున్నారు.

బాధంటే లేకపోవటమే. లేకపోవటమే బాధ.
శూన్యంలో జ్వలించే అంతులేని నిట్టూర్పే బాధంటే,
జ్ఞాపకాలు అస్పష్టం కానంతవరకూ
బాధ ఓ సర్ప పరిష్వంగమే!
భావానికీ రూపానికీ మధ్య పరుచుకొనేదే వేదన
కలకూ వాస్తవానికీ దూరం చెరిగే వరకూ
వేదన ఓ దృతరాష్ట్ర కౌగిలే!

నాకు తెలుసు ప్రతి క్రియా నిర్దేశితమేనని
నాకు తెలుసు ఈ బాట ముగింపేమిటో
నాకు తెలుసు నేనూ క్షతగాత్రుల బృందంలో ఒకరినని
కాలం సముద్రంలా అన్నింటినీ తనలో కలిపేసుకోగలదని
అయినా జీవితమంటే సాయంకాలపు వ్యాహ్యాళి కాదుగా!

(మిత్రుని మరణంపై)

## అతడు - ఆమె

అతడామెను
నడిచే చందమామ అని
పరుచుకొన్న వెన్నెలనీ
నిలచిపోయిన వసంతమనీ
వర్ణించాడు.

ఆమె నవ్వుని
పూల పరిమళంతో
సెలయేటి స్వచ్ఛత తో
రత్న కాంతుల సవ్వడితో
పోల్చాడు.

ఆమె కళ్ళను
బటర్‌ఫ్లై విప్పారిన రెక్కల ద్వయమనీ
ఆత్మలోక ద్వారాలనీ
రెండు పున్నమిలనీ
మిగిలిన దేహమంతా
ఆ రెండు కళ్లకూ పొడిగింపు అనీ
అన్నాడు.

ఆమె చూపుల్లో
ప్రేమలోక సంగీతముందనీ
కాంతులీను కరుణా ఝురులున్నాయనీ
అమరత్వానికి ఆహ్వానాలున్నాయనీ
అన్నాడు.

ఆమె మాటలు
నెరళ్ళుతీసిన నేల అడుగున

ఉండే విత్తును మొలకెత్తించే ఆర్ద్రతనీ
పరాజితుడిని కూడా అజేయుని
చేయగలిగే మంత్రమోహన శక్తులనీ
తేనె జలపాతాలు కుంచించుకుపోయి ఆమె
పెదవులపై తారాడే శబ్ధతరంగాలయ్యాయనీ
ఎన్నో అన్నాడు
అతాడామె గురించి చాలా చెప్పాడు.

కాని ఆమె మాత్రం
ఒక చిరునవ్వు శాపమిచ్చి సాగిపోయింది.
తెరచాటు మనిషి కదా!

## ఆస్పత్రిలో ఒక చావు

కట్లు తెంచుకొని ఓ హంస ఎగిరిపోయింది.
ఎళ్లిపోయావా అమ్మా
బతికినన్నాళ్ళూ మా కోసమే బతికి......
నిన్నటి దాక ఆమెను పనిమనిషిలాగ వాడుకొన్న
ఓ కొడుకు భోరు భోరున నటిస్తున్నాడు.

మిగతా రోగుల మొహాలపై
భయం యాసిడ్లె విస్తరించింది.
చావు వాసన వైరాగ్యమై, వేదాంతమై, కర్మ సిద్ధాంతమై
వార్డంతా మంచులా పరుచుకొంది.

ఓ ముసలాయన కళ్లు మూసుకొని
తనులేని ప్రపంచం ఎలా ఉంటుందో
కలల తెరపై చిత్రించుకొంటున్నాడు.

నాడాలు కొట్టబడుతున్న ఎద్దులా
నిస్సహాయంగా పడున్న పక్షవాత రోగి కనుగుడ్లు
బొట్లు బొట్లై ద్రవించినయ్...... అసూయతో.

'ఏయ్ అటువెళ్లకు' అంది ఓ పురటాలు
డాక్టర్ని చెయ్యాలనుకొంటున్న తన పెద్ద కొడుకుతో

'అందరూ పోతున్నారు కానీ వీడింకా పోడు' అని
ఓ రోగి బంధువు గుండె తన ద్రాక్ష గుత్తుల స్వప్నాలు
నిజమాయ్యేదెపుడోనని మూలుక్కుంది.

ఇద్దరికీ ఇంకా బేరం కుదిరినట్టు లేదు.
మృతురాలి బంధువు జేబు బరువుగానూ
వార్డుబాయ్ జేబు ఖాళీగాను ఉన్నాయి.

వాసన పసిగట్టిన ఓ శవాల రిక్షావాడు
తలుపుమూసిన వంటింట్లోకి ఎలా వెళ్లాలో తెలీని పిల్లిలా
ఎవర్ని కదపాలో తెలీక కిటికీ వద్ద తచ్చాడుతున్నాడు.

దూరంగా ఓ బైరాగి, తోలు తిత్తి ఇది తూటులు తొమ్మిది......
అంటూ తత్వం గొణుగుతూ మధ్యలో దగ్గురాగా
దగ్గరుకు మింగుతున్నాడు.

ఆసుపత్రి పక్కనే ఉన్న గబ్బిలం గదుల లాడ్జికి
ఎదురుగుండా ఉన్న మందుల షాపుకి
గోడకానుకొని ఉన్న రౌండ్ ది క్లాక్ హెటల్ కీ
ఉప్పుచేపలా వడలిన దేహంతో ఖాళీ సీసాలమ్మే ముదుసలికి
ఈ రోజుతో ఓ బేరం తగ్గిపోయింది.

దూరంగా చెట్టుపై వాలిన హంస ఓ సారి నవ్వుకొని
ఎగురుకొంటూ మబ్బుల్లో కలసిపోయింది.

## తిరిగి భవిష్యత్తులోకే........

నెత్తిన దిగే మేకుల్లాంటి బూతుమిళితపు ఆజ్ఞల్లో
నేల చూపుల కళ్ళు స్రవించే నెత్తుటి బూడిదలో
సముద్రపొద్దున గవ్వలేరుకోవాల్సిన
బాల్యమంతా క్షతగాత్రుని రోదనయినపుడు......

చందనపు పూతక్రింద చంద్రుని వెన్నెలతో
పోటీ వచ్చే మేని ఛాయై శోభిల్లవలసిన
యవ్వనాన్నంతా గోరింటాకు చేసి
విటుల కండరాలకోరలకు అద్దే పరిస్థితుల్లోనో లేక
కండరాల్ని సముద్రం చేసే ప్రయత్నంలోనో
రొచ్చుగుంటయిన దేహంతో
అంటించబడ్డ క్రొవ్వొత్తిలా
యవ్వనం రాత్రికి రాత్రి హతమైనప్పుడు........
కాలం ఊయలీకరించాల్సిన జీవితం
బాధల వృక్షానికి శిలువ వేయబడి
గాయాల్ని శ్వాసిస్తుంటే........

మీరాశించే పరిణతి మాకెక్కడ సాధ్యం?
మీరు శాసించే నాగరికత మాకెక్కడ లభ్యం.

అందుకే పచ్చబొట్ల వలువల్ని ధరించి
తిరిగి భవిష్యత్తులోకే మా పయనం.

8-11-91 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక

## ఎంతహాయి......

వేళ్ల అందాలని మట్టి క్రింద
కప్పెట్టేసిన చెట్టుదెంత స్వార్ధం.

పక్షిపిల్ల సౌందర్యాన్ని
జిగురు జిగురుగా తనలో దాచేసుకొన్న
గుడ్డుదెంత జాణతనం.

అద్భుత శిల్పాలను గర్భంలో ధరిస్తూ
బండగా కనిపించే ఈ రాళ్ళెంత మొండివి.

ఈ రాత్రెంత మోసకత్తె కాకపోతే
వేకువని సూచనగానైనా తెలుపుతుందా.

అంతెందుకు నువు మాత్రం
మదినిండా నన్ను నింపుకొని
ఒక్క చిరునవ్వు చాక్లెట్టైనా ఇచ్చావా?

******

కలల కర్చీఫ్ తో గుండె కన్నీళ్లు
తుడుచుకోవటమెంత హాయి.

## నిరీక్షణ

ప్రియా
అమలిన చింతనో లేక
అలౌకికానందమో తెలీదు కానీ
నీ వియోగంతో ఆత్మరహితమైన
ఈదేహాన్ని
నిరీక్షణలు నిరీక్షణలుగా
శిల్పీకరించుకోవటంలో
ఎంతానందముందనుకున్నావ్!

కొమ్మను తాకగానే పాటను
స్రవించిన కోయిలలా
చెమ్మను తాకగానే దళాల్ని
ప్రసవించిన విత్తనంలా.....
అత్యంత ప్రకృతి సహజంగా
నా ఈ నిరీక్షణా శిల్పాల మధ్య
తుమ్మెదల్లా
నీ జ్ఞాపకాలు తిరుగాడుతూంటాయి.

## ఆకాశం తెరచుకొంది

చీకటి అలముకున్న త్రోవలో
హృదయనేత్రం వెలుగురేఖకై
తడుముకుంటోంది.

దూరం నుంచి వినిపించే
గాన మాధుర్యంతో
గాలిపరిమళిస్తోంది.
పరిమళోన్మత్తుడనై నేను
మూర్ఛనలు పోయాను.

ఆకాశం తెరచుకొంది.
ఒక్క విద్యుల్లత,
నూలుపోగులాంటి
ఒక్క మెరుపు మెరిసింది.
ఓవర్ ఎక్స్‌పోజ్ చేయబడ్డ ఫొటోలా
దృశ్యం తళుక్కుమంది.

అవ్యక్త స్వప్నాలను
స్థిరీకరించే వెలుగు
లిప్తపాటు జిగేల్ మంది.

అది నీ దరహాసమా ప్రభూ?
******
నే ధరించిన
దుస్తులు మాసిపోయాయి.
అబద్ధాలు, దొంగనవ్వులు, మోసాలు
కపటప్రేమలు, ఈశ్వర ధిక్కారం
అనే మురికి చేరింది.

దుస్తుల్ని చిలక్కొయ్యకు తగిలించి
నీ ప్రేమ లీలామృతధారలకై
వెతుకులాట మొదలెట్టాను.
అన్ని ప్రశ్నలకూ సమాధానం
నీవని తెలుసుకున్నాను.
నే పుష్పింపచేసుకొన్న
నా అజ్ఞానం నాకు గోచరమయింది.
నీ ఒళ్ళోకి నన్నిచ్చేసుకోవటానికై చేసే
నిరీక్షణలో నే కూరుకుపోయాను ప్రభూ!

ఇంతలో
నీ అడుగుల మెత్తని చప్పుడు.
గాలి పరిమళించటం తెలుస్తోంది.
ప్రభూ
నీ సంజ్ఞతో కాబోలు
హృదయంపై వాలిన పిట్టలు
రివ్వున ఎగిరిపోయాయి.
ఇక హృదయవనంలో ఏ సవ్వడీ లేదు,
తీవ్ర తేజస్సుతో ప్రకాశించే నిశ్శబ్దం తప్ప.
ఇంతవరకూ లతల్లా పెనవేసుకొన్న
బంధాలు అంధకారంలో లీనమయ్యాయ్.

ఆకాశం తెరచుకుంది.
అమృత బిందువులుగా
నీ కరుణ వర్షించింది.
నా చుట్టూ వెలుగు,
ఆత్మను వెలిగించే వెలుగు
అంతశ్శాంతిని పంచే వెలుగు
భువంతా పరుచుకుంది.

అపుడు నాలోని ప్రతీమొగ్గా
వసంతమై ప్రవహించింది.
నాలోని ప్రతి శబ్దమూ
రాగాల రెక్కలను తొడుక్కుంది.
నాలోని ప్రతి వర్ణమూ
రాగ రంజితమయింది.

ప్రభూ
నీ దయా పరిమళ స్పర్శ
నన్ను పారవశ్యానికి
శాశ్వత బంధీని చేసేసింది.
ఇక ఈ విపంచిక
నిన్నే గానం చేస్తో
వెలుగుని కప్పుకొన్న
పగలులా సంచరిస్తోంది.
******
అందరూ కన్నీళ్ళతో నాదేహాన్ని
ఓదారుస్తున్నారు – పిచ్చివాళ్ళు
ఇది అభినందించాల్సిన సందర్భమని
ఎప్పటికి తెలుసుకుంటారు?

**(........సారి చలం గీతాంజలి చదివిన మత్తులో)**

## టేబుల్‌పై చేతివాచీ

టేబుల్‌పై చేతివాచీ
నెలవు తప్పిన కలువలా ఉంది.

ఇది విచ్చలవిడిగా తిరిగిన దూరాల్లోంచి కానీ
అపురూపంగా చూసుకొన్న నడకల్లోంచి కానీ
ఒక్క అడుగుకూడా తిరిగి రాదు కదా!

దాని డయల్ నూతిలో
అనుభవాలు, జ్ఞాపకాలు, కాలపు తునకలు.
ఎంతజీవితాన్ని ముక్కలు ముక్కలుగా
కత్తిరించి ఉంటాయో కదా దీని ముళ్ళు.

టేబుల్‌పై చేతివాచీ
కాలంలా ముసలిదైపోయింది.

ఎంతకాలాన్ని
నిరీక్షణలు, నిస్పృహలు, అసహనాలుగా
పోతలు పోసి ఉంటుందో కదా ఈ వాచీ.

ఎన్ని టిక్కట్టు ముక్కల్ని చింపిందో,
ఎన్ని సిగరెట్ పీకల్ని రాల్చుకుందో కదా!
ఎన్ని నిలుపుకోలేని
వాగ్దానాల్ని పరిహసించి ఉంటుందో కదా.

టేబుల్‌పై చేతివాచీ
అపుడూ, ఇపుడూ అదే మోనాలిసా నవ్వుతో.

కాలాన్ని బంధించాననుకొన్నాడు మనిషి కానీ
దీని డయల్ ఊబిలో పీకలోతు కూరుకుపోయాడు.

టేబుల్‌పై చేతివాచీ
ఒకనాటి పెళ్లికానుక.

ఒక వనాన్ని పొడుం చేయగల
ఒడ్రంగి పిట్ట ముక్కంత బలంగా
ఒక జీవితాన్ని పొడుచుకుంటూ
పోయిందీ ముల్లు గర్ర.

టేబుల్‌పై చేతివాచీ
ఇల్లు ఖాళీ చేసేపుడు డ్రాయర్ సొరుగులో దొరికింది.
నాన్న పోయిన మూడో రోజున అది ఆగిపోయి ఉంది.
యుద్ధానంతరం విస్మరింపబడే సమరయోధునిలా.

ఈమాట వెబ్ పత్రిక జనవరి 2009

## రెండు దేశాలు

బజారులన్నీ జనాలతో బలిసినయ్.
డబ్బు, డబ్బు, డబ్బు
కుంభవృష్టిగా కురుస్తూంది.
కొనుగోలు శక్తి మధ్యాహ్నపుటెండై
ప్రకాశిస్తోంది.

భాషతో నిమిత్తం లేకుండా
సర్వాంగాలతో సంభాషించే ఆటకత్తెలా
మూలాలకు దూరమైన ధనం
వింతైన నృత్యం చేస్తూంది.

ప్రపంచ కుబేరుల జాబితాలో మనవాళ్ళు
ఏటా పెరుగుతున్న కోటీశ్వరుల సంఖ్య
లక్షల ఎల్కేజీ చదువులకై బారులుతీరిన జనం
అక్షయ తృతీయనాడు స్వర్ణ విస్ఫోటనం
రాడోవాచీలు, రేబాన్ అద్దాలు, పెద్దతెర టీవీలు,
కోట్లు పలికే విల్లాలు, రవ్వల దుద్దులూ, డిజైనర్ దుస్తులూ
డిజిటల్ దినాలు, పబ్బులూ, డిస్కోతెక్‌లూ, ఏరోడ్రోములు, హెలికాప్టర్లూ
చంద్రయానాలు, ఇంద్రభోగాలు, చలువరాతి హర్మ్యాలు.

నా దేశపు దరిద్రమంతా ఎక్కడికి పోయింది?

చేట లోని రోజుల శిశువు భయం భయంగా చూస్తూంటూంది.
బోరుబావిలో పడిన గ్రీజు మరకల బాల్యానికి ఊపిరాడదు.
కూరగాయల్ని కొనలేనితనం దాకలో చారై మరుగుతా ఉంటాది.
సెంటు స్థలం కోసమై పోరాడే ప్రాణాన్ని తూటా తన్నుకుపోతుంది.
అమ్మకానికి శిశువులు, ఇక్కడ స్త్రీ ఓ గర్భాగారం.
రోడ్డుపక్క డేరాలనిండా నిర్వాసిత గిరిజనులు.
హైవేపక్కన మెరుపుల చీర చెయ్యూపుతూంటుంది.

'బ్లడీ బెగ్గర్స్ బ్లడీ ఇండియా' బి.ఎమ్.డబ్ల్యూ కారు అద్దం పైకి లేచింది.

ద్రావకం మింగిన కంసాలి, నూలుపోగుకు ఉరేసుకొన్న నేతకాడు.
పురుగుమందూ పత్తిరైతూ, లాడ్జీలో కుటుంబం సెన్సెక్స్ హత్య

నా దేశపు సౌభాగ్యమంతా ఎక్కడికి పోయింది?

ఇక్కడ రెండు దేశాలు కనపడుతున్నాయి
ఒకటి సంపన్న భారతం
మరోటి దరిద్ర భారతం.

## సూర్య నమస్కారం

ఈ రోజు కూడా సూర్యుడు బహుసా
ఆకాశపుటటెండెన్స్ రిజిష్టరులో
రెండు సంతకాలూ చేసేసి వెళిపోయుంటాడు.
మోరెత్తి సూర్యుడిని చూసెన్నాళ్లయిందో!

టన్నులకొద్దీ వెలుగుని కుమ్మరిస్తూ
దినాన్ని స్ఫటికంలా మెరిపించి
అనంతాంధకారాన్ని కలుగులోకి తరిమేసే
సూర్యుడిని పలకరించి చానాళ్ళయింది.

నీడలు, గోడలు, నేలను తప్ప మరొకటెరుగని కనులు
ధవళకాంతి రహస్యాలను పరిమళించలేవు.

గదుల్లోంచి, గదుల్లోంచి, గదుల్లోంచి, గదుల్లోకి జారే
దైనందిక ఇనుప క్షణాలలో
మసకవెలుతురే అన్నిచోట్లా రాజ్యమేలుతుంది.
చలువకనులజోడు కిటికీ కర్టెనై
కిరణ విహంగాల రెక్కలు కత్తిరిస్తుంది.

పడమటి నల్లబల్ల తన రంగుల్ని చెరిపేసుకొన్నాక
మసకవెలుతురు మరింత చిక్కబడుతుంది.
******
అయినా భ్రమకాకపోతే కానీ
ఈ నగర జీవనాంధకారారణ్యంలో
కాంతి తన కిరణ పాదాలతో సంచరించగలిగే
ఆరుబయళ్ళెక్కడున్నాయి
ఇళ్ళమధ్య పిచ్చిగా పరుగులెత్తే రోడ్లుతప్ప.

వెలుగు రేకలు ఈతలు కొట్టటానికై
విశాలమైదానాలెక్కడున్నాయి
తేనెగూళ్ళ లాంటి ఇరుకు హర్మ్యాలు తప్ప.

నగర మనిషికసలు మోరెత్తి సూర్యుడ్ని చూసే
తీరికేదీ? ధైర్యమేదీ?

## ఏమంటావూ?

సోక్రటిస్ తాతా!
చావు, బతుకులలో ఏది ఉత్తమ మార్గమో?
అంటూ గొప్ప సందేహాన్ని
మా మొహాలపై చల్లి పోయావు.
ఆ ప్రశ్నకు జవాబింకా దొరకలేదు.

కాల మౌనగిలిటిన్ అతిసున్నితంగా
తనపని చేసుకుపోతోంది తప్ప
ఇప్పటిదాకా నోరు విప్పనే లేదు.
ఏ ఒక్క ఆత్మా తిరిగొచ్చి
'ఇదీ సంగతి' అని చెప్పిన పాపానా పోలేదు.

మృత్యు పాత్రిక ఒంపులలో జీవితం
సుబ్బరంగా ఇమిడిపోతూనే ఉంది.

కొత్త అనుభవాలను, ఆలోచనలనూ
యాచించే భిక్ష పాత్ర
రోజూ ఉదయిస్తూనే ఉంది.

స్వప్నాల హంసలు ఖాళీ గాలిలోకి
అలా అదృశ్యమౌతూనే ఉన్నాయి.

తాతా
కొంపతీసి అంతా మిథ్యే నంటావా?
అన్నీ ఇక్కడే నంటావా?

ఆవకాయ్.కాం వెబ్ పత్రిక ఏప్రిలు 13 2009

## ఒక వేకువ

కోడి కూసింది
ఈకల మెరుపు
ఆకశానికి విస్తరించింది.

చుక్కల్నీ చంద్రుణ్ణీ
చంకనేసుకొని రాత్రి
చల్లగా జారుకుంది.

పారిజాతం పూల
ఎర్రెర్రని గొట్టాల్లోంచి
ఎట్టకేలకు ఉదయసంధ్య
విడుదలైంది.

నిద్రగన్నేరు చెట్టు
ఆకుల పిడికిళ్ళు తెరిచి
కిరణాల గింజల్ని
ఏరుకోవటం మొదలెట్టింది.

## చిత్రానికి కవిత

ఒక సన్నని గీత
మనో కాన్వాసుపై విస్తరించి
ఆకైంది, కొమ్మైంది, చెట్టైంది
కొండమలుపు వద్ద నదీ నడుం వంపైంది.

ఒక వర్ణ బిందువు
మది తెరపై వలికి
తూలికైంది, పక్షైంది, పక్షి గూడైంది
తల్లి హృదయమై ఆకలి తీర్చుతుంది.
చిత్రకారుడిది కవిదీ కూడా!

## సాగరతీర సాయింత్రం

ఈ సముద్రం ఒక దట్టమైన నీలి కలువై
తన అలల రేకల అంచులతో
అచల ఏకాంత తీర సైకత మౌనాన్ని ముద్దిడి
తన హృదయలోతుల్లో జనించిన గవ్వల పుప్పొడితో
అభిషేకం చేస్తోంది, ఒకానొక ఆదిమ లాలస గా.

మానవజాతి కర్మ జలాలన్నీ
ఈ సువిశాల కాల పాత్రికలో
కెరటాలు కెరటాలు గా మరుగుతున్నాయి.

నిర్జీవ గవ్వల శూన్యపు హోరులో
సరుగుడు చెట్ల గాలి ఊళలపై
నీలాంబర పారదర్శకత పై
నిర్లిప్త శిలల మౌన చర్మంపై
ఈ లోతైన క్షణాల కలంతో
ఈ సాగర తీర సాయింత్రం తన
మృత్యు గీతాన్ని లిఖించుకొంటోంది.

సూర్యుని కొల్లకొట్టి పిటపిటలాడుతూ
ప్రకాశించిన పగలు పగుళ్ళు తీసింది.
ఆ పగుళ్ళలోంచి రాత్రి చీకట్ల మౌనం ఊరుతుంది.
చలితడి ప్రవహిస్తూంది.
వెలుగు వర్ణాలు కారిపోతున్నాయి.

వార్ధక్యంతో వంగిపోయిన
ఈ సాయింత్రానికవతల సుదూరంగా
వెన్నెల సంగీతంతోనూ, నిశ్శబ్ద అలల పరిమళంతోనూ
నా విభుని జ్ఞాపకమొకటి స్వప్న దారులలో
మిల మిలా మెరుస్తూ జ్వలిస్తూంది.

**అంతరించిపోతున్న పిచ్చుకలపై.........**

నువ్విక్కడికి రావటంలేదంటే
ఎక్కడో ఉండే ఉంటావులే
అనుకున్నానింత కాలమూ.
అక్కడా లేవట కదా! మరెక్కడికి పోయావూ?

రెక్కల టపటపల గమకాల్ని పలికిస్తూ
మెరుపు వేగంతో అటూ ఇటూ ఎగురుతో
మా పచ్చని హృదయాలపై వాలే దానివి.

ఇంటిచూరుకు వేలాడదీసిన
వరికంకుల కుంచె ఓ నక్షత్రమై
నీకు ప్రేమగా స్వాగతం పలికేది.

నీ అవిశ్రాంత మైధున సంగీతానికి
ఊరు మొత్తం ముసిముసి నవ్వులతో
సిగ్గుపడుతూ మురిసిపోయేది.

చూరు అంచునో లేక మిద్దె కంతల్లోనో
నీవు నిర్మించుకొన్న స్వర్గం వైపు
ఎవరైనా తొంగిచూస్తే వాని తలపై గింగిర్లు కొడుతూ
అరుస్తూ నీవు చేసే హడావిడికి
గాలి కూడా బిత్తరపోయేది.

మట్టిలో పొర్లాడుతూ చేసిన ఇసుక స్నానాలు
చాతీపై నల్ల మచ్చతో నీ లైంగిక ద్విరూపకతా
పెరట్లో సస్య రక్షణ గావించిన నీ ఉక్కు ముక్కు
గాయపడ్డ నీ దేహాన్ని సంరక్షించిన మా బాల్యాలు
నా కిటికీ పై వాలి పాటలు పాడి తుర్రుమన్న
ఆ క్షణాలన్నీ, తమ గాలి పెదాలతో

ఈ పుస్తక పుటల్ని రెపరెప లాడిస్తున్నాయి.

పెంకుటిళ్లు నిద్ర పగుళ్ళలోంచి
కారిపోయిన స్వప్నాలైన వేళ
అవని మొహంపై రసాయినదాడి నేపథ్యంలో
సెల్ ఫోన్ రేడియేషన్ కనిపించని మృత్యు వలై
నిన్ను కబళించివేసిందా?

నువ్వు వస్తావని, గుడిలో శరగోపమంత
అందంగా పేనిన వరికంకుల కుంచె
ఇంటి స్లాబ్ ఇనుప కొక్కానికి
కాశీ ఆవు ఐదో కాలులా వేలాడుతూ
మమ్ములను వెక్కిరిస్తూంది.
తరువాత 'మీ వంతు' అంటూ
భయపెడుతూంది.

## అనుమానపక్షి

లేగదూడ
కత్రాట గుంజుకు పోయింది.
దాచేసుకొన్న పాలను
చేపుతుంది ఆవు.
దూడ మెడలో గంట
దొంగలిద్దరినీ పట్టించేసింది.

మట్టు పైని అణుగుకోడి
ముక్కుతో గుడ్లను మరోసారి
లెక్కెట్టుకొని, దగ్గరకు లాక్కొంది
.
ఆవకాయ్.కాం వెబ్ పత్రిక డిశంబరు ౨౦2008

## నీవు లేవు..........

పక్షుల్నీ, పండుటాకుల్నీ, నా ప్రశాంత క్షణాల్నీ
ఈ పిచ్చి తుఫాను గాలులు వేటాడుతున్నాయి.
పక్షులు దారితప్పాయి.
పండుటాకులు నేలరాలాయి.
నా ప్రశాంత క్షణాల ఏకాంతం లోంచి
నువ్వూ అదృశ్యమయ్యావు.

చీకటితో పిటపిటలాడే తుఫాను రాత్రీ
నేనూ మిగిలాం ఇక.

ఆవకాయ్.కాం వెబ్ పత్రిక జనవరి 25 2009

## కాలం

భవిష్యత్తంటూ ఏమీ ఉండదు.
అనంతమైన అవకాశాలన్నీ
వర్తమానంలోకి కుప్పకూలుతాయి.

వర్తమానమూ ఒక భ్రమే, ఎందుకంటే
దాన్ని చేరగానే గతంగా మారిపోతుంది కనుక.

గతం మాత్రమే నిజంగా నిజం.
జ్ఞాపకాల మచ్చలు, జీవితాన్ని నిర్ధేశించే అనుభవాలు
కళ్లవెనుక కదలాడే నులివెచ్చని దృశ్యాలు
కళ్ళు మూసే దాకా వెంటాడుతూంటాయి.

## స్వేఛ్ఛ

చీకటి గదిలో కూర్చొని
సీసాలో బంధించిన
మిణుగురులను చూస్తూ
మురిసిపోతుంది మా అమ్మాయి.

ఆరుబయటకు వచ్చి
సీసా మూత తీసాను.
ఆకాశం సీసా నిండా మిణుగురులే!
చిన్నారి కళ్లలో వెన్నెల మెరుపు.

ఆవకాయ్.కాం వెబ్ పత్రిక డిశంబరు 19, 2008

## సంవత్సరీకాలు

నీవిక లేవన్న వాస్తవానికి
చెట్టుతొర్రలో పక్షి పిల్ల ఆర్తనాదంలా
హృదయం కీచుమంది.

మెతుకు వృధా, బతుకు వృధా అంటూ
తీతువు పిట్ట అరుచుకొంటూ సాగింది.

ఆ లోహ క్షణాల రంపపు కోతకు
నిలువెత్తు జీవన వృక్షమూ
కన్నీరు చిమ్ముకుంటూ నేలకొరిగింది.

కాలం ఎంత చిత్రమైనది.
నీవు లేవన్న వాస్తవం
ఎంత నిశ్శబ్దంగా అదృశ్యమైంది.

కలలూ, కన్నీళ్లు
ధరలు, దరిద్రాల వంటి
దినసరి వెచ్చాల్ని ఖర్చు చేసుకొంటూ
ఎంత దూరం నడిచేసానూ!

ఆవకాయ్.కాం వెబ్ పత్రిక నవంబరు 25, 2008

## నైట్ షిఫ్ట్ కేబిన్ మాస్టర్

పట్టాలపై రైలు బండి
మిణుగురుల దండలా మెరుస్తోంది.

నిదురించే ప్రయాణీకులు
గమ్యాల్ని స్వప్నిస్తున్నారు.

అతను మాత్రం
నిద్రను నిలువునా పాతరేసి
ఎరుపు ఆకుపచ్చ కాంతుల చేతులతో
ప్రతి రైలునూ నిలుపుతూ, పంపుతూ ఉంటాడు.

అతనూపిన పచ్చ జండాకి
వేయి స్వప్నాల్ని కడుపులో మోస్తున్న
ఇనుప అనకొండా భారంగా కదుల్తుంది.

ప్రయాణీకులు నిదురలో గమ్యాల్ని
పలవరిస్తూ ఉంటారు.

నూట నాలుగు జ్వరంతో ఉన్న వాని కూతురుపై
కలిగిన ఆలోచనల్ని ఎక్స్‌ప్రెస్ రైలు
తన చక్రాల పాదాలతో తొక్కేస్తుంది.
ఇంటివద్ద సగం ఖాళీ గా ఉండే మంచపు తలపుల్ని
గూడ్సు బండి ఎక్కించుకు తీస్కుపోతుంది.
నిదురలో అతని మెడచుట్టూ చేతులు వేసి
దగ్గరకు లాక్కొనే జీవనానురాగాలకు
తనెప్పుడూ ఓ జీవిత కాలం లేటే.

ప్రయాణీకులు గమ్యాలలో
నిద్రించినట్లు స్వప్నిస్తూంటారు.

ఒక్కో రాత్రి అరవై, డబ్బై రైళ్లను పంపించి
తెల్లారేసరికల్లా తనో రైలు చక్రంగా మారిపోతాడు.

అదే పట్టాపై, అదే చక్రం అనంత దూరాలు సాగినట్లుగా
ఎరుపు, ఆకుపచ్చ కాంతుల మధ్య వాని జీవితం
జీవరాహిత్య గూడ్సు బండిలా సాగుతూంటుంది.

పట్టాకు, చక్రానికి మధ్య నలిగిన రూపాయి బిళ్లలా
షిఫ్టుకీ, షిఫ్టుకీ మధ్య వాని జీవగడియారం చితికి
ఎపుడో వచ్చే వృద్ధాప్యాన్ని ఇపుడే బోనస్ గా అందిస్తుంది.

ఒక్క పొరపాటు
వేయి శవాలను పీల్చుకొనే మూడడుగుల నేలనే సత్యం
వాని నరాలలో పాదరస ప్రవాహాల్ని పరుగులెట్టిస్తుంది.

తప్పుకొన్న పట్టాల మధ్య పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించి
తనో నిలువెత్తు ఎర్రజెండాయై
పరిగెత్తే రైలుకు ఎదురెళ్తూ వేసిన వెర్రికేకలు
అసహనపు ప్రయాణీకుల తిట్లలో కరిగిపోతాయి.

మెలుకువ గాజు పెంకులపై
అతను చేసిన తపస్సు ఫలితంగా
నిదురించే ప్రయాణీకులు
తమ తమ గమ్యాలలోకి మేల్కొంటారు.

**సాఫల్యం**

ఏం బుద్ది పుడుతుందో
కొద్దికొద్దిగా నన్ను శ్వాసించటం
మొదలుపెడతావు.
నెమ్మదినెమ్మది గా నన్ను
ప్రేమించానని తెలుసుకొంటావు.
ఆ క్షణమొక పుష్పమై
నీమది కిటికీలోంచి తొంగిచూసి
నాకై వెతుకుతుంది.

నీ జీవితంతో నా స్వప్నాలు ఫలించాయి.

**మార్పు**

చాలాకాలం తరువాత కలిసాం
నా హృదయంలో ముద్రించుకొన్న
ఆ 'నువ్వుని' నీలో ఎంత
శోధించినా కనిపించలేదు.

మనం కలుసుకోకుండా ఉంటే
ఎంత బాగుణ్ణు.

**పటాటోపం**

నేలను, సూర్యుడినీ దోచుకొని
దాచుకొన్న సౌందర్యాన్నంతటినీ
కోల్పోయిన సుమం
మౌనంగా మరణించి
కాల లోయల్లోకి జారిపోయింది.

వికసించటంలోనే దాని చావుందని
తెలియక ఎంత పటాటోపాన్ని ప్రదర్శించిందీ!

## దొమ్మరి పిల్ల

మృత్యు తీగపై మోళీ కట్టే బాలిక
అడుగులో అడుగేసుకొంటూ నడుస్తూంది.
ఆమె పట్టుకొన్న వెదురుగడకు
ఒక వైపు జీవిక, మరోవైపు బాల్యం
వేలాడుతున్నాయి.
చిన్న అపశృతి
రోడ్డుపై రక్తపు మరక.

దేముడు
పని ఇంకెప్పటికి నేర్చుకొంటాడూ?

## సాంగత్యం

బయట
ఉరుములు మెరుపులతో
కుంభవృష్టిగా వాన.
అర్ధనిమీలిత నేత్రాలతో
ప్రశాంతంగా నిద్రిస్తున్న నీవు.
సన్నిధిలో ఎంతటి
భరోసా ఉంటుంది.

## గిల్టీ

బండి చక్రం క్రింద
తొండ పడింది.
చూస్తూండగానే
దాన్ని గద్ద తన్నుకుపోయింది.
అయిదేళ్ల మా పాప కళ్లల్లో
కళ్లుపెట్టి చూడలేకున్నాను.

ఆవకాయ్.కాం వెబ్ పత్రిక జనవరి 3, 2008

## అవని ఏమంది?

చిల్లులు పడిన ఓజోను దుప్పటిని కప్పుకుని
పీలికలైన పచ్చని చీరను చుట్టుకొని
నీళ్లలో తడిసి ఒరిసిపోయిన పాదాలతో
తీవ్రమైన జ్వరంతో వణుకుతున్న
అవని ఏమంది?

కుచించుకుపోతున్న అడవులు
వాహనాలు వెతచిమ్ముతున్న విషాలు
ఎడారులయ్యే పంటభూములు
తీరాలను ముంచెత్తే సాగరాలు
వ్రణాలు పడుతున్న పర్యావరణం....
బిడ్డా .... కళ్లుతెరు.... కళ్లుతెరు అంది.

అవని ఏమంది?
సూర్య పవన జలశక్తులను మచ్చిక చేసుకొని
శిలాజ ఇంధన హెూమాన్ని నిలువరించమంది.
స్విచ్ ఆఫ్ చేసినా స్టాండ్ బై లో ఉంచినా
పరికరాలు పీల్చుకొనే లవలేశ శక్తినీ
అన్‌ప్లగ్ చేసి అరికట్టమంది.
ఫిలమెంటు బలుబుల వేడి వెలుగు స్థానంలో
ఫ్లోరెసెంట్ కాంతుల వెన్నెలను పూయించమంది.

స్విచ్ నైనా కుళాయినైనా 'అయితే ఏంటటా?' అనే నిర్లిప్తతనైనా
లేచి వెళ్లి కట్టేయటానికి బద్ధకించవద్దన్నది.

అవని ఏమంది?
నియంత్రించలేని విషవలయంలోకి పోయి
మిమ్మల్ని మీరే తొలగించుకోవద్దంది.

ఒక్కక్షణం ఆపమంది
ఉక్కిరిబిక్కిరవుతున్న తాను

ఊపిరి తీసుకోవటానికి
ఒక్క క్షణం ఆర్పమంది
ఎక్కుతున్న తన కంఠం
గుక్క తిప్పు కోవటానికి

అవని ఏమంది?
ఒక్కక్షణం ఆపమంది
ఒక్కక్షణం ఆర్పమంది
ఒక్కక్షణం ఆపమంది
ఒక్కక్షణం ఆర్పమంది

గ్లోబల్ వార్మింగ్ పై అవగాహనా ప్రచారంలో భాగంగా నిర్వహించిన 'బత్తి బంద్' కార్యక్రమానికి మద్దతుగా

**పాపికొండలు**

ఆమెను తాకగానే,
ఓ నీటి బిందువులోంచి
నా ప్రవర వినిపించింది.
ఇక్కడి ప్రజల గుండెల్లో
గోదావరి ఉత్త నదే కాదు,
మరింకేదో!

******

పిల్లలకు చాక్లెట్లు
పంచిపెట్టే చర్చి ఫాదర్ లా
జాలర్లకు చేపలు
పంచుతోంది, నది.

******

నదికి అడ్డంగా పెద్ద కొండ
ప్రవాహం ఆగలేదు
మలుపు తీసుకొంది
జీవితం లానే!

******

డామ్ సంకెళ్లు
వేయించుకోబోతున్న
ఈ నదీ ప్రవాహాన్ని
చూస్తూంటే జాలేస్తుంది.
ఇకపై కూడికలు, తీసివేతల
ప్రకారం ప్రవహించాలి.

******

వానచినుకును
సాగరంలోకి
నన్ను కవిత్వంలోకి
చేరవేస్తోందీ, నది.
******

నీరు లేక బయటపడ్డ నదీగర్భం
రాచపుండు గుంతల్లోంచి
కనిపించే వెన్నెముకలా ఉంది.
******

ఒక్క క్షణం ఆగానో లేదో
నది, నన్ను దాటుకొని
నవ్వుకొంటూ వెళ్లి పోయింది

## ముళ్ల గాయాలు

ఆకుల వలనుంచి
తప్పించుకొన్న కాంతి,
చేతికి చిక్కని నీడల పొడల్ని
నేలపై చిత్రిస్తూంది.
అనంత జీవనానుభూతుల మధ్య
దొరక్కుండా ఆడించే
ఒకటో రెండో స్వప్నాల్లా.

నువ్వైనా నేనైనా
గుప్పెడు స్వప్నాలమే! కదా?
లేకుంటే పిడికెడు జ్ఞాపకాలము.
తుమ్మచెట్టు గుండా వీచే గాలికి
చర్మం నిండా ముళ్లగాయాలే! పాపం.

ఒంటరితనాన్ని గుర్తుచేసే
రాత్రి మళ్లా వచ్చేసింది.
పగటి కన్నీటి చారికల్ని
నిదురవాన కడిగేసింది.

కనులు తెరచి సూర్యోదయాన్ని
నూత్న శిశువులా ఆహ్వానిద్దాం

## కవిత్వం నా ఇంటిపెద్ద

ప్రశ్నల ఇసుకను
కళ్ళల్లో చల్లి పోతుంది ఒక్కో అనుభవం.
అపుడు కలిగే ఆలోచనలను
గ్లాసులు బంధించలేవు
గదులు నిర్బందించలేవు
హృదయం కట్టి పడేయలేదు.
ఫలితంగా
లోపల్లోకంలో వీచే వెర్రి గాలులకు
చెట్లకొమ్మలు ఊగిపోతూంటాయి.

అపుడు కవిత్వం
పరామర్శించటానికి వస్తుంది.
అపుడు కవిత్వం
ధైర్యవచనాలు చెప్పి ఓదారుస్తుంది.
అపుడు కవిత్వం
నన్ను మళ్ళా మనిషిని చేస్తుంది.

అందుకే
కవిత్వం నా ఇంటిపెద్ద..

.

## వంశ వృక్షం

ఒక వృక్షం
ఇష్టంతోనో, అయిష్టంగానో
కొమ్మలు రెమ్మలుగా విడిపోయి
నలుదిక్కులకూ చెదిరిపోవటం
ఎంతటి అనివార్యమిపుడు!

అవసరపడో, అనురాగంతోనో
ఆ కొమ్మలన్నీ తమ పువ్వుల, తుమ్మెదల
సమేతంగా గుమిగూడటం
ఎంతటి అబ్బురం!

తమలో ప్రవహిస్తున్న పత్రహరితపు
మూలాల్నీ, మార్గాల్నీ
తెలుసుకోవటం, తెలియచెప్పటం
ఎంతటి సంబరం!

అన్ని వర్ణాలూ
ధవళ కాంతిలోకి కుప్పకూలినట్లుగా
అన్ని శాఖలూ
వంశమనే అద్దంలో ఒదిగిపోవటం
ఎంతటి లీలా వినోదం!

నాస్టాల్జిక్ పొత్తిలిలో
కేరింతలు కొడుతున్న
వృక్ష శకలాలను సమయం
చెర్నకోలై అదిలించటం
ఎంతటి ఛిద్ర దృశ్య విషాదం!

## పోలవరం నిర్వాసితుల కోసం.....

నాకు పెద్దగా లెక్కలు రావు
ఎన్ని వందల స్మశానాలో
ఎన్ని లక్షల శవాలో
ఎన్ని కోట్ల వెలుతురు గింజలో
నే చెప్పలేను.

రెండు కొండల మధ్య సూర్యుని చూపి
అది ఏ సంధ్యంటే ఎవరు మాత్రం
ఏం చెప్పగలరు!

లక్షల సంవత్సరాల
కన్నీళ్ళు నెత్తురులు
ఇంకించుకొన్న ఈ నేల
ఇకపై తన పరిమళాల తూనీగల్ని
ఎగరేయదంటే ఎందుకో
హృదయంలో ఇసుక నింపినట్టుంది.
ఇంకా తవ్వబడని ఓ నాగరికతను
జల సమాధి చేసేస్తుందీ నేల

ఏడుతరాల అన్వేషణలో ఎవరో
ఓ మానవుడు ఇక్కడకు వస్తే
ఇక ఈ నేల ఏమి చూపగలదూ
నిలువెత్తు అంధకార జలస్థంభాన్ని తప్ప.

ఈ మట్టినే నమ్ముకొన్న
చెట్టు ఇకపై పాడదు.
పిట్ట ఇకపై పూయదు.

మనిషి మాత్రం
ఇక్కడ తన్ను తాను నరుక్కొని
మరెక్కడో పాతుకొంటున్నాడు.
ఆ రక్తరహిత జననం కోసం
తట్టా బుట్టా సర్దుకొంటూ, ఈ నేలతో
తన అనుబంధాల్ని, అనుభవాల్ని
ఎలా తీసుకెళ్ళాలో తెలీక
అలా వానలో తడుస్తున్నాడు.

సుళ్ళుతిరిగే మౌనంపై
శూన్యంలోంచి కురిసే వాన
సూదులతో గుచ్చే ముళ్ళ వాన.

తడిచేవానికే తెలుస్తుంది
తడి పదునెలా ఉంటుందో.

(పోలవరం ప్రోజెక్టు నిర్మాణంతో కనుమరుగయ్యే వందల ఊళ్ళను, నిర్వాసితులయ్యే స్థానికులను తలచుకొంటూ)

## ప్చ్

బలాన్నంతా కూడదీసుకొని
దూరంగా విసిరేసిన ఓ స్వప్నం
మెల్లమెల్లగా కనుమరుగైంది
ఎగిరే పక్షికూతలా.

అక్కడ ఆ చీకటిచలిలో
అదిచేసే దుర్బల ఆర్తనాదం
లీలగా వినిపిస్తోంది.
లేదు అవును లేదు అవును అవును
అవును అదింకా నన్ను ప్రేమిస్తూనే ఉంది.

ఎపుడో ఒకప్పుడు
అది ఓ రెక్కల గుర్రమై
ఎగురుకుంటూ వచ్చి
నన్నెక్కించుకొని
ఆ కొండపై దింపుతాది.

అప్పటికి ఈ ప్రపంచం
ఇంకా లోయలోనే ఉంటుంది.

## స్ట్రీట్ చీమలు

అంత తక్కువకైతే కిట్టదయ్యా
మరో రెండురూపాయిలిప్పించండి.
లేదు లేదు నీకు కిడితేనే ఇవ్వ
బలవంతం ఏముంది?
ఆ రాత్రి
కప్పు కంతల్లోంచి చుక్కల్ని చూస్తున్న
జాంకాయల వ్యాపారినడిగింది భార్య
'వచ్చేవారం పిల్లాడి పుట్టిన రోజు గుర్తుందా?'

ఊరిలోని పెద్దపులిని ఎవరో చంపేసార్ట
షట్టర్లు మూసుకొన్నాయి, తాళాలు పడ్డాయి
లాఠీలు పగిలాయి, తుపాకులు పేలాయి.
డబ్బు డబ్బును కాపాడుకొంటూంది.
రేపేమిటన్న ప్రశ్నకు మత్తుమందిచ్చి
నిద్రపుచ్చిన పాతబట్టల వ్యాపారి
'నాకాకలిగా లేదు నువ్వు తినేసి పడుకో' అన్నాడు భార్యతో

'బేరంలేదని నేటి వడ్డీ రేపు కడతానంటే ఎలా'
ఉన్నదంతా పీల్చుకుపోయింది
రోజుకు ఇరవై రూపాయిల వడ్డీ జలగ.
నిద్రకు ముందు ఆ తాళంచెవుల వ్యాపారి విన్న ఆఖరుమాటలు
'కొన్న మందులు రేపటితో అయిపోతాయి
డాక్టరు చీటి జేబులో పెడుతున్నాను
తెచ్చుకోవటం మర్చిపోవద్దు'

ఎండిన ఖర్జూరంలాంటి దేహంతో
అలంకరణ సామాన్లమ్మే ఆ ఒకనాటి ఆటకత్తె
ఎర్రటి ఎండకు తాళలేక చెట్టుకిందకు చేరింది.
'అమ్మా పుస్తకాలు తొందరగా కొనుక్కోమంటున్నారే

రేపు కొంటావా?' అనడిగిన కొడుకుకు
ఆ రాత్రామేం సమాధానం చెప్పింది?

'మామ్మా ఇవి తీసుకో' అని మిగిలిపోయిన
పళ్ళని వీధి బిచ్చగత్తెకిచ్చేసి ఇంటికి
బయలుదేరాడతను చుక్కల వెలుగులో
'నాన్నా స్కూలు వెళ్ళాలంటే భయంగా ఉంది
ఓ కుర్రాడు వెంటపడి వేధిస్తున్నాడు' బేలగా అంటోంది కూతురు.

'బండి ఇక్కడ ఎందుకు పెట్టావురా దొంగవెధవా'
తన్నిన తన్నుకు బండిమీద చైనా వస్తువులు
రోడ్డుపై చెల్లాచెదురూ ట్రాఫిక్ ఆగుతుందా?

******

కొన్నిరోజుల తరువాత
సూర్యుని వెనుకే ఉదయించిన
మీసాలింకా రాని స్వరమొకటి ఇలా అరుస్తోంది
'జత పది **జత పది** జతపది

## ఫ్రాగ్మెంట్స్

ఇక ఇప్పుడు
సంభాషణ అంటే
సెల్‌ఫోను డిస్‌ప్లే లో
నంబరు చూసుకొని
టాక్ బటను నొక్కడమే!
నాగరికతా
నరకాన్ని ప్రేమిస్తాను
కొలిమిలోకి ఒంటరిగా సాగనీ!

******

రాత్రి నుంచి వానచినుకులు
మంత్రాల్ని జపిస్తూ
ఆకులతో వల్లె వేయిస్తూన్నాయి.
వానచినుకుల
చుంబనాలతో అలసిన
తడితడి పూలపెదవులపై
వేకువ వెండివెలుగై పరుచుకొంది.

******

అలంకరణ అద్దం
ఆమె అందాన్నంతా
తిరిగిచ్చేసింది.

******

పావుగంటగా ఆలోచనలేమీ లేవు
యవ్వనం ఫోల్డర్ తెరచా!
నీ పరిమళం చుట్టుముట్టింది.

******

'బాబూ! ఒక స్ట్రిప్ ఐ పిల్స్ ఇవ్వు'
జీన్స్ లో ఆమె
బైక్ పై అతను
రసాయిన సమానత్వం

******

పాతికేళ్ళలో ప్రపంచం
ఎంత మారిపోయినా
మా ఊరి తాటి ముంజెలకు
ఇంకా అదే రుచి

******

సీసాలో ద్రవంలా
ఈ లోకపు అన్ని వంకరలనూ
ఇముడ్చుకొన్న నాడు
సంకెళ్ళు కూడా సుఖంగా ఉంటాయి

******

కొబ్బరాకుల వెనుక
నిశ్శబ్ద చంద్రోదయం
వెన్నెల చక్కిలిగిలికి
రాలిన కొబ్బరి పూత

******

కోరికకు సాఫల్యానికి
మధ్య అగాధం.
చితిలో ఇంకా నిప్పుంది
పోరాడాల్సిందే.

******

నగ్న తరువులకి
పత్రాల పుష్పాల దుస్తులు లేవు.
వసంతం వస్తోంది.

******

రోడ్డుపై
పేదేరుకొనే పిల్లగాని చెమట
కుండీలో
గులాబీల్ని పూయించింది.

******

వసంతం చివరి రోజున
జన్మించిన సీతాకోకచిలుక
చీమలకు చిక్కింది.
ఇంద్రధనుస్సు చచ్చిపోయింది.

******

దేవుని పటానికి
ప్లాస్టిక్ దండ.
ఎన్నటికీ వాడని
కోపం.

## జీవన మాధుర్యం

చేయాల్సిన పనులలా
మిగిలిపోతూనే ఉంటాయి.

కెరటాలు ఒకదానివెనుక ఒకటి
పరుగులెడుతూనే ఉన్నాయి
నెలనెలా వెన్నెల కుబుసం
ఆకాశం నుండి రాలిపడుతూనే ఉంది.
వర్షాకాలంనుంచి తీసుకొన్న పగ్గాల్ని
వేసవికిచ్చేసి సాగిపోతుంది శీతాకాలం

చేయాల్సిన పనులలా
పేరుకుపోతూనే ఉంటాయి.

కొన్ని పనులు
మరుపులోయల్లోకి జారినట్టే జారి
ఫీనిక్స్ పక్షుల్లా పైకి లేస్తున్నాయ్.

రేపు, వచ్చే ఏడాది, ఎప్పటికైనా అంటూ
చేయాల్సిన పనులు
భవిష్యత్తు నిండా పాదులా
అల్లుకొని బిగుసుకొన్నాయి.
జీవితాన్ని అడ్డంగా నిలువుగా
అడ్డదిడ్డంగా పరుగులెట్టిస్తూన్నాయి.

రెండుకాళ్లపై నించొని
ఆకులనందుకో యత్నించే మేకపిల్లలా
హృదయం శ్రమిస్తూనే ఉంది.

అయినా సరే
చేయాల్సిన పనులలా
మిగిలిపోతూనే ఉన్నాయి.

## ఆటో ప్రకాష్ 9945029294

(వైజాగ్ లో ఒక ఆటోడ్రైవర్ గర్భిణీ స్త్రీలను ఉచితంగా హాస్పటల్ కు తీసుకు వెళ్ళటం పట్ల చూసిన వార్తకు స్పందించి)

ప్రపంచం దృష్టెపుడూ
పసిపాపలపైనే
ప్రేమించటానికో లేక
వ్యాపారించటానికో.

అయితే ఇతని చూపు
పండు భారానికి వంగిన కొమ్మపై ఉంటుంది.
నిండుగర్భిణిని పాపాయిగా మార్చి
పొత్తిళ్ళలో పొదుగుకోగలడు.
మూలాలపై మమకారమే తప్ప
వ్యాపారముండదిక్కడ.

నెలలు నిండిన స్త్రీ ని చూస్తే
మగవాడికి భయమో జలదరింపో!
బహుసా స్త్రీ ముందు తన
అస్థిత్వమేమిటో గుర్తొస్తుందేమో.
ఇతనికి మాత్రం
తన శైశవపు పెదవులనుండి
శబ్దిస్తూ విడిపోయిన తన తల్లి
చన్మొన జ్ఞప్తికొస్తుందేమో.

కాన్పుకు సిద్దమైన స్త్రీ నడుస్తూంటే
మృత్యువు, ప్రాణమూ
కలిసి తిరుగుతున్నట్లుంటుంది.

సృష్టిగాలులకు ప్రాణదీపం
రెపరెపలాడే ఆ రాత్రివేళ

మనిషికీ మనిషికీ మధ్య
నమ్మకపు పరిమళం ప్రవహిస్తుంది.
ఇతని మనిషితనం ముందు
మృత్యుదేవత తలదించుకొని
మౌనంగా నిష్క్రమిస్తుంది.

పుడమి లోతుల్లోంచి
మరో ఉదయం బయటపడింది.
దానిని తవ్వితీసిన తల్లి పొడికనులు
ఇతనిని తడిగా చూసిన చూపుల భాషలోనే కదా
ఈ లోకపు కీర్తనలన్నీ వ్రాయబడ్డాయి!

అంచులవరకూ నిండిన తృప్తితో
ఇతనూ వెనుతిరుగుతాడు
ఎప్పటిలానే!

## చేయాల్సిందల్లా......

సూర్యుడు, నదీ
కొండల పంజరంలో
చిక్కుకొన్న గానుగెద్దులు....
ఒకటే దారి, ఒకటే గమ్యం
దేహాలతో వచ్చిన చిక్కే ఇది.
అదే హృదయాన్ని చూడు
ఎంత విశృంఖల విహారియో
అన్ని దారులూ తనవే
అన్ని గమ్యాలూ తనకే
హృదయం ఆలోచనలను
కాలంలోకి ప్రవహింపచేస్తూంటుంది.
స్వప్నాలను బలంగా వెలుగులోకి తోసే రాత్రిలా.

చేయాల్సిందల్లా
హృదయాన్ని నిత్యం కొలిమిలో
జ్వలింపచేసుకోవటమే.

లేదూ
తూనీగై మబ్బుల్ని ముద్దిడిన ఉదయంలా
రాలిపోనూవచ్చు లేక
పండులా ఫలించిన సాయింత్రమై
పగిలిపోనూ వచ్చు.

రాలిపోయే ఆకుల సవ్వడిని
నిశ్శబ్దం కూడా గుర్తించదు.

పులసా! పులసా!

ఇక్కడే గుడ్లు పెట్టాలనే
లక్షల సంవత్సరాల నీ ఇన్‌స్టింక్ట్ ని
ఇకనైనా మార్చుకోలేవా?
ఆనాటి మానవులం కాం మేవిపుడు.
మనిషిని మనిషే అంగట్లో
సరుకుగా మార్చే కాలమిది.

బజారు గట్టుపై నీవు
మృత్యు జలాలలో ఈదుతూన్నపుడు
నీ కనుల మెరుపుకి నా హ్యూమన్ రైట్సన్నీ
కాలి బూడిదయ్యాయి.

సాగరాల్ని ఓడించిన
నీ రెక్కలు మౌనం దాల్చినపుడు
నా జాతి ఔన్నత్యమంతా
హా హా కారాలు చేస్తూ ఆవిరయ్యింది.

'సెన పులసైతే రేటెక్కువ'
అన్న మాటవద్ద, సరిగ్గా అక్కడే
నా జాతి భవిష్యత్తు నాకు
స్పష్టంగా కనిపించింది.

'పుస్తెలు తాకట్టు పెట్టైనా పులసను తినాలి'
అంటూండే మా అనాగరీక తాత
ఇపుడైతే
'పుస్తెలమ్మైనా పులసను కాపాడండ్రా'
అనే వాడేమో!

(నదీ పరీవాహక ప్రాంతాలలోకి గుడ్లు పెట్టటానికై సముద్రం నుంచి, ఇక్కడి వలలకు చిక్కి దాదాపుగా
అంతరించిపోయిన పులస చేపల గురించి)

# ఎందుకు?

ఎవరు వింటారని ఈ అక్షరాలను
వెదురు రంధ్రాల గుండా
ప్రవహింపచేస్తున్నాను!

ఎవరు చూస్తారని
ఈ భావాలకు రెక్కలు తొడిగి
నీలాకాశంలోకి ఎగరేస్తున్నాను!

ఎవని మనోయవనికపై
మొలకెత్తుతాయని
ఈ కవితా బీజాలను రాల్చుకొంటున్నాను!

ఏమో తెలీదు బహుసా
గాలికి పిట్టకి చెట్టుకీ
కూడా తెలీదేమో!

## బొల్లోజు బాబా

| | |
|---|---|
| తల్లిదండ్రులు | బొల్లోజు బసవలింగం, అమ్మాజి |
| సహచరి | సూర్య పద్మ |
| పిల్లలు | అపరాజిత, బసవ శ్రీధర్ |
| చదువు | M.Sc.,B.Ed.,M.Phil.,(Ph.D) |
| వృత్తి | జంతుశాస్త్ర అధ్యాపకుడు, |
| రచనలు | 'యానాం విమోచనోద్యమం' (1954 లో యానాం లో ఫ్రెంచి పాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం గురించి) |
| ఇ.పుస్తకాలు | విశ్వకవి రవీంద్రుని 'స్ట్రే బర్డ్స్' అనువాదం |
| | 'ఎడారి అత్తరులు' ప్రముఖ సూఫీ కవుల కవిత్వానువాద సంకలనం |
| | పాబ్లో నెరుడా 'ఇరవై ప్రేమ కవితలు ఒక విషాద గీతం' కు స్వేచ్ఛానువాదం |

పై ఇ.పుస్తకాలను అంతర్జాలంలో పి.డి.ఎఫ్. రూపంలో http://www.scribd.com/bollojubaba అనే సైటు లో చదువుకొనవచ్చును.

బ్లాగు: http://sahitheeyanam.blogspot.com/

ఫోను నం: 9849320443, 0884/2368189